# కన్నకొడుకు

సాంఘిక నాటకం



గ్రంథకర్త
శ్రీ పినిశెట్టి శ్రీరామమూర్తిగారు



పబ్లిషర్సు
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

వెల రు 1—8—0

# చరిత్రలు - కథలు

| | | |
|---|---|---|
| మహాత్మాగాంధి | 0 | 8 |
| జవహార్‌లాల్ నెహ్రూ | 0 | 8 |
| హిట్లర్ దురంతములు | 0 | 8 |
| సుభాస్ చంద్రబోస్ | 0 | 8 |
| చిత్తరంజన్ దాసు | 0 | 8 |
| బాబూ రాజేంద్రప్రసాద్ | 0 | 8 |
| అచ్యుతపట్వర్ధన్ | 0 | 8 |
| జాతీయనాయకులు 1 భా | 1 | 4 |
| డిటో 2 భా | 1 | 8 |
| రాజగోపాలాచారి | 0 | 8 |
| జై హింద్ (చక్కని పద్యములు) | 0 | 4 |
| మదనమోహనమాలవ్యా | 0 | 8 |
| రవీంద్రనాథటాగూర్ | 0 | 8 |
| అబుల్ కలామ్ అజాద్ | 0 | 8 |
| జనాబ్ జిన్నా | 0 | 8 |
| నెహ్రూ ఇందిరకు వ్రాసిన లేఖలు | 1 | 0 |
| కస్తూరిబా గాంధీ | 0 | 8 |
| అజాద్ హింద్ ఫౌజ్ | 1 | 0 |
| జైహింద్ వచనం | 0 | 8 |
| స్వామి వివేకానంద | 0 | 12 |
| ఆచార్యకృపలానీ | 0 | 8 |
| భూలాభాయిదేశాయి | 0 | 8 |
| సర్దార్ వల్లభాయి పటేల్ | 0 | 8 |
| బాలనాగమ్మకథ | 0 | 12 |
| విజయలక్ష్మీపండిట్ | 0 | 8 |
| ఖాన్ సోదరులు | 0 | 8 |
| అరుణాఅసఫాలీ | 0 | 8 |
| ఛత్రపతి శివాజీ | 0 | 12 |
| పృథ్వీసింగ్ | 0 | 8 |
| ప్రకాశం | 0 | 8 |
| పట్టాభి | 0 | 8 |
| జయప్రకాశనారాయణ | 0 | 8 |
| సుభాస్ చంద్రబోస్ 200 పే॥ | 1 | 0 |
| పరారీ నేతాజీ | 1 | 0 |
| సాయిబాబా జీవిత చరిత్ర | 0 | 12 |
| రామకృష్ణ పరమహంస | 0 | 12 |
| శ్రీనాథకవి చరిత్ర | 0 | 12 |
| వేములవాడ భీమకవి | 0 | 8 |
| తెనాలిరామకృష్ణ | 1 | 0 |
| బమ్మెర పోతరాజు | 0 | 8 |
| శ్రీకృష్ణదేవరాయలు | 0 | 8 |
| నారదముని కథలు | 1 | 0 |
| సహస్రశిరచ్ఛేద అపూర్వ చింతామణి | 3 | 8 |
| నలమహారాజుకథ—వచనం | 0 | 12 |
| పంచపాండవుల అజ్ఞాతవాసం పెద్దది బైండు | 1 | 8 |
| భోజకాళిదాసు కథలు | 0 | 12 |
| కాశీరామేశ్వర మజిలీకథలు | 2 | 0 |
| పెద్దబొబ్బిలిరాజుకథ | 0 | 12 |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

# కన్న కొడుకు

అను

## (సత్య జ్యోతి)

సాంఘిక నాటకం



ప్రకాశకులు :

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

1956



[ వెల రు. 1—8—0

రాజమహేంద్రవరమున

శ్రీ కొండపల్లి ముద్రాశాలయందు

ముద్రింపబడినది.

# హెచ్చరిక

ఈ "కన్నకొడుకు" నాటకము యొక్క సర్వహక్కులు మేము పొందియున్నాము. మా లిఖితపూర్వకమైన అనుమతి లేనిదే ఎవరూ ఏవిధంగాను ఈనాటకమును ప్రయోగించుకొనరాదు. ఇందుకు అతిక్రమించిన వారు మేము జరుపు సివిల్ క్రిమినలు చర్యలకు బాధ్యులు కాగలరు.

ఇట్లు

రాజమండ్రి | కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
ది 2-7-52 | శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

# అంకితం

ఒకనాడు చీకటిలో ముంచిన సంఘానికి

వెలుగుదారులు చూపి,

విజేయుడైన విజ్ఞాని

కందుకూరి వీరేశలింగం పంతులుగారి

హృదయాబ్జానికి వినమ్రంగా

పినిశెట్టి

# విజ్ఞాపన

ఇది 1944 లో నాటకరచనలో ఇదే మొదటిది. ఈపేరు మీదనే నాట్యమండలికూడా స్థాపించాను. అప్పట్లో పురాణ నాటకాల ప్రతిభ, వాటితో బాటుపద్యాల ప్రాబల్యం, ప్రతిప్రేక్షకుని పైనా పనిచేసింది.

పద్యంలేని నాటకం నాటకంకాదనే వాదనకూడా లేకుండా పోలేదు. కేవలం సాంఘికనాటకం, పద్యాలులేకుండా ప్రజలమధ్య పడితే చప్పచప్పగా ఉండని తప్పక చప్పరిస్తారనే అదురు కారణం గానే । పద్యాలతో ఇది వ్రాశాను. 1945 లో మాఆదర్శనాట్య మండలి ఈనాటక ప్రదర్శనం ద్వారానే ఆంధ్రనాటక కళాపరిషత్తుకు కూడా పరిచయమైంది. ప్రదర్శనం బాగుంటటంవల్ల ప్రత్యేక యోగ్యతాపత్రంకూడా బహూకరించారు

ఆ ఉత్సాహంతోనే సుమారు పన్నెండు నాటకాలవరకూ ప్రదర్శించాం. ప్రదర్శనాలద్వారా సంతృప్తిని కూడా పొందగలిగేం. పద్యాలయందు మమకారముండి పాతనాటకాలపట్ల విముఖముగా ఉన్న సందిగ్ధహృదయాలకు ఈనాటకం బాగా ఉపకరిస్తుంది. ఉద్దేశం మంచిదై ప్రదర్శనం ప్రేక్షకుని హృదయస్పందనానికి కారణమైతే కల్పనలో ఉత్ప్రేక్షఉన్నా ఫరవాలేదు. ఈ నాటకరచనకు అన్నివిధాలా సహకరించిన మిత్రము నాగిరెడ్డి వెంకటరత్నంగారికి నాకృతజ్ఞత.

ఇట్లు,

రచయిత.

# పాత్రపరిచయం

## పురుషులు

ఉదయభాను:— కథకుడు
ప్రసాద్:— ఒక విద్యార్థి
సుబ్బారాయుడు:— కథకునితండ్రి
మూలయ్య:— పెళ్ళిళ్ళ పేరయ్య
పాపన్నశాస్త్రి:— సుబ్బారాయుడు బావమరది
అబద్ధం:— సుబ్బారాయుడు యింటినౌకరు
డాక్టరు

## స్త్రీలు

నిర్మల:— కథానాయకి పాపయ్యకూతురు
శశి:— సుబ్బారాయుడు కూతురు విధవ

# కన్నకొడుకు



## 1 వ రంగం—ప్రభాతం

[పాపయ్య యింటిముందు వీధి. ఎడం ప్రక్కనుంచి సూర్యోదయా రుణకాంతులు ప్రసరిస్తూ ఉంటాయి తెల్లని దుస్తులతో శశి]

పాట

ఉదయమాయేనే భానుడుఉదయమాయేనే భానుడుఉదయమాయేనే
ఉదయములోనా సదమల ముదమును గనగలేచిచూడు మదే ॥ఉ॥

నిర్మల—(ముగ్గుపళ్ళెం నీళ్ళచెంబుతో పాడుతూ ప్రవేశం)
ఉదయ మాయేనా భానుడు ఉదయ మాయేనా
భానుడు ఉదయ మాయేనా॥
(శశిని చూచి) ఏమే శశీ, ఉదయమే ఇలా బయల్దేరావు?

శశి—ఏమిా తోచక.

నిర్మ—అ తోచకపోవడానికి కారణం......

శశి—కారణం?

నిర్మ—ప్రసాద్ కదూ.

శశి—ఏం మాట లవి ఒదినా! ప్రసాదా?

నిర్మ—చల్ల కొస్తూ ముంత దాయడం దేనికి శశీ? నేనెవరితో నన్నా చెబుతా నేమోననే భయంమాత్రం వద్దు. మావయ్య గారవానికి మిా అన్నయ్య పేరుప్రతిష్ఠలతి...భంగం...మంచిపని కాదని చెప్పాను. నువ్వు మరోవిధంగా అనుకోవద్దు.

శశి—అబ్బ! గుక్క తిప్పుకోనీకుండా చెప్పేస్తున్నావేం ఒదినా!
(కోపంగా) ఎవరు చెప్పారూ? (కంగారుగా) మా నాన్నగారికి
ఏమన్నా తెలిసిందా? పట్టిది వదినా నే నేమీ ఎరగనసలు.

నిర్మ—ఎందుకంత కంగారు? ఎవ్వరికీ తెలియదు లే. గాలివార్త నాకే
తెలిసింది. దగ్గర దానవు కాబట్టి జాగ్రత్త అని చెప్పాను
అయినా నేనుకూడా నమ్మలేదు లే. (నవ్వును)

శశి—చూశావే ఒదినా! ఎంతమాట పుట్టించారో! నిజంగా నువ్వు
నమ్మావేమో నని భయపడ్డాను. మరీ... వెళతాను.

నిర్మ—ఆనందంగా వచ్చినదానివి హఠాత్తుగా పోవడం దేనికి? ఉత్సా
హంగా పాడిన ఆ ముందు పాట పూర్తిగా పాడి మరీ వెళ్ళు.

శశి—అంతమాత్రాన్నే హఠాత్తా? ఏంమాట లవి ఒదినా. ఎదగ
బోయే చిగురాకు చల్లగాలికే వాలిపోతుందా? ఎన్నో గాలి
వానలను కూడా తట్టుకొని నిలుస్తుంది మరీ...ముందు పాట
కదూ నువ్వన్నది (నవ్వి) అదిగో చూడు.

గగనసీమలో మిలమిలమెరిసే తారల తళుకులు తెలతెలవారె
ముకుళితమై నాపద్మకన్నియల ముగములు వికసితమాయే నే
భానోదయమే ఆయేగా ఆయేగా ఆయేగా॥

(నిర్గమించును)

నిర్మ—(ఆపాటనే అందుకుని పాడుతుంది)

ఉదయమాయిన ఫలితము లేదు. ముదము లేనీ జీవులకు ॥ఉ॥
వాడిన పూలకు వాసన రాదూ మోడుల కీమెడ ఆకులురావూ
పీడకు వెలుగు నీయగ లేదూ శాంతికి శత్రువు కాదా భానూ ॥ఉ॥

[ప్రయాణసన్నాహంతో పాపయ్య ప్రవేశం]

పాపయ్య—అమ్మాయ్! మీ అత్తారింటికి వెళ్తున్నాను: ఇంటిదగ్గర
జాగ్రత్త!

నిర్మ—మీ రిపుకు వెళ్ళేంత అవసరం యేమొచ్చింది నాన్నగారూ ?

పాప—అయ్యో! నీ మరుపు అఘ్యాన్నంగానూ! నిన్నేకదుటే ఆయనకు జబ్బు ఎక్కువగా వుందని ఉత్తరం వచ్చింది. నీకు చదివి వినిపించటంకూడా జరిగింది. అంతమాత్రం గుర్తులేదుటే.

నిర్మ—గుర్తు అనే దాన్ని గుటికా పెట్టుకొన్న మరుక్షణాన్ని మరచిపోవడం సహజమై పోయింది. నాన్నగారూ! పాపం జబ్బు అంత ఎక్కువగా ఉంటే ఆ పల్లెటూళ్లో బాధపడే దానికంటే మన ఊరు తీసుకవచ్చి ఏమంచి హాస్పిటల్లోనైనా జేర్పించ కూడదూ ?

పాప—బేష్ ! మంచి చక్కటి ఆలోచన చెప్పావే నిర్మలా. అలాగయితే రేపుదయాన్నే తీసుకు చక్కావస్తాను. ఎలాగయినా వ్యాధిపీడితుడై పోయాడు. ఇంతకూ ఏక్షణమైనా ప్రపంచాన్ని మరచిపోవలసిన అగాయిత్యము పట్టడంమాత్ర అబద్ధం కాదు.

నిర్మ—అంటే నాకేమీ అర్థంకాలేదే! మరోసారి చెప్పండి నాన్నగారూ !

పాప—అయ్యో! పిచ్చితల్లీ! అతని ఆస్తిపాస్తులకు కదటే యీఅవస్థ అంటాను. ఏదో ఆయన బ్రతుకుండగానే ఆకాస్త కొంత్రా నీ పేర వేయిస్తే పదినాళ్ళ పాటు బ్రతికి బయట పడటానికి ఆస్కారం ఉంటుందని కదుటే అతనికి నిన్నిచ్చి పెళ్ళిచేసింది. సరే! వేళ మించుతుంది. వెళ్ళివస్తాను. కుక్కలూ గట్రా వస్తాయి. ఇంటిదగ్గర జాగ్రత్త. (వెళ్ళును)

నిర్మ—వృద్ధాప్య వివాహాలు చేయడంలో ముఖ్యోద్దేశ మిదా? బోధపడింది. నిజముగా నేను పిచ్చదాన్నే.

[అబద్ధం నాటు కేసు బెడ్డింగుతో కూనరాగంతో ప్రవేశం]

నిర్మ—(ఆశ్చర్యంగా వెనుకనుంచి) అబద్ధం.

అబ—(మాట్లాడకుండగా వెళ్తాయుంటాడు)

నిర్మ—(బెడ్డింగు కొనవట్టుకొని) అబద్ధం నిన్నేనోయీ!

అబ—(తుళ్లిపడి బెడ్డింగు వదలి నిర్మలను చూడకుండా) బుద్ధి లేలే దంటయ్యా మమడసి రోరో రోడ్డే వత్తుంటే మెమె నీహ మమ మాటగా లల లాగెయ్యటమే నన్నమాట (నిర్మలను చూచి) మిమి మీరా ఇఇ ఇంకా ఎఎ వ్వరో అనుకున్నాను.

నిర్మ—నీకు ఒకటి చెవుడు; రెండవది ఎక్కు. మాటోది దృష్టి మాంద్యము కూడా కలిగిందేటి?

అబ—అవునండి పాపా పొద్దున్నే బయల్దేరారంట.

నిర్మ—ఎవరు బయల్దేరినవారు!

అబ—నన్నా ఇఇ పెట్టే ఇఇ పరువు ముందు ఇఇ యింటికి తీసుకెళ్ళమన్నారండి.

నిర్మ—నోరు నెత్తి మోందుకున్నా వినిపించదు కదా!
(బిగ్గరగా) ఇంతకూ ఆ వచ్చేవారెవరో చెబుదూ చంపక

అబ—(తెలిసినట్లుగా నవ్వి) మీా మీా మీారనేది అదా!
ఇఇ ఇంకెందుకూ ముచ్చటైనా మిమి మీా మేనమామ కొడుకుంటే ముసలోడికి కట్టిబెట్టారు. మీా మీా నాన్నగారు.

నిర్మ—(కోపముతో) ఛీ! అవేం మాటలు. అబద్ధం! తప్పుకదూ (విసుగుగా) ఎంత చెప్పినా అర్థంకాదు, ఏలాగా చెప్పేది (ఆలోచించింది)

అబ—(గ్రహించి నన నాకేం వినిపించటంలేదు. ని నిర్మలమ్మగారూ! ఆ ఆనవాలుగా చెవితే అలనకట్టేత్తానండి.

నిర్మ—ఓహో అలా చెబితేనే గాని అర్థంకాదూ (సంజ్ఞచేస్తూ)యీలో పెట్టి యీ బెడ్డింగు ఎవరిచ్చారు ?

అబ—అ అదా... తె తెల్పల్లేను... చెప్పేయ్యనా (నవ్వి) మీమీ మేనమామగారి కొడుకులూ మా మా వారగారి అ అబ్బాయిలూ అయిన ఉ ఉదయభాను గారండీ

నిర్మ—(ఆనందంగా) ఉదయభానా. ఉదయభాను కాలేజీ నుంచేనా వస్తోంట ! కాలేజీ నుంచేనా ?

అబ—(పెదవికరచి) ఎ ఎందుకన్నా అంత సంతోషం ! ము ముసలి మొగుణ్ణి మరచిపోయారా యేమిటి ? నాకెందుకు లెండి.

(ముద్దుపాట పాడుకుంటూ వెళ్ళును)

నిర్మ—అబద్ధం పేరైనా అతను చెప్పిన మాటల్లో అబద్ధంలేదు.

గీ, హృదయము మేనాడో గైకొన్న ♦ ఉదయభాను
ఆత్మనాథుగ మురిసితి ♦ అంతలోనె
ముసలిభర్త మూల్గులు ♦ విని ముదుపుమఱచి
హత్యనై పోతి సంఘ ♦ పుటదురు తోడ.

(ఉత్సాహంగా ఉదయభానువచ్చి నిర్మల కళ్ళుమూయును)

నిర్మ—(చేతులు తీసి చూచి) పరాధీనమై బాధపడుతోన్న స్త్రీపై చేయి వేయడం ధర్మం కాదు.

ఉద—మనోనాథుని ఆగమనమును ఎరిగుండి కూడా ఆహ్వానించక పోవడం ధర్మమా ?

నిర్మ—మనోనాథుడవు నీవు శరీరనాథుడు మరొకరు.

ఉద—ఏమిటా మాటలు నిర్మలా !

నిర్మ—(చెప్పటానికి నోరు రాక క్షోభతో బాధపడి లోనికి వెళ్ళును)

[తెర మారుతుంది భాను వెనకనే వస్తాడు]

ఉద—ఏమిటి ఆ కన్నీళ్ళు ?

నిర్మ—ఆనంద బాష్పాలు.

ఉద—ఆనంద బాష్పాలా అట్లాంటి సూచనలేమీ కనిపించడంలేదు

నిర్మ—లేదు. ఉదయభాను ! ఇవి అగ్నికణాలు !

ఉద—అగ్నికణాలా !

నిర్మ—అసత్యమెందుకు, అశ్రుబిందువులే భానూ.

ఉద—ఆనందబాష్పాలు అగ్నికణాలుగా అగ్నికణాలు అశ్రుబిందువులుగా మారటానికి కారణం.

నిర్మ—ఆదిలో మనయొక్క ఐక్యహృదయాలవల్ల ఆనందబాష్పాలు రాల్చిన యీకళ్ళు, మా నాన్నగారు నాకుచేసిన అన్యాయానికి అగ్నికణాలు విరజిమ్మినై. ప్రస్తుతం నీరాకకు హతాశతో అశ్రుబిందువులు అర్పిస్తున్నై.

ఉద—(విసుగ్గా) అబ్బ ! యేమిటి నిర్మలా యీ మాటలు ? నేను కాలేజీనుంచి రాగానే అహ్వానించి ఆనందపరుస్తావని నావిజ్ఞానార్జనకు నీవు ఎంతో అభినందిస్తావని, వచ్చిన నారాక, మెరిసిన నా మురుపు నీమాటలద్వారా మాయంచేస్తున్నావు నాహృదయంలో తుపానా సృష్టిస్తున్నావు! అదేదో కాస్త స్పష్టంగా చెప్పకూడదూ నిర్మలా.

నిర్మ—(విచారంగా) చెప్పలేను భానూ !

ఉ. కట్టితి ప్రేమసౌధమును ♦ కాపురముండగ నీవు నేను న
ప్పట్టున లేతకౌగిళుల బాహుల ♦ మధ్యము చిక్కబట్టి ప్రే
మట్టిపడన్ చరింతుమని ఊరట ♦ లాడితి గాని గాలిలో
కట్టిన మేడ నిల్చు నొకొ కాం ♦ తుడ నే దది కూలిపోయెనే

నోరు రాదు ఏలాగొస్తుంది. మా నాన్నగారికన్నా నా భర్తవృద్ధు లని చెప్పటానికి నోరు ఎలావస్తుంది.

ఉద—భర్తా! ఏమి టా అర్థం లేని మాటలు నిర్మలా.

నిర్మ—నిజం భానూ, నన్నొక ముసలివానికి ఇచ్చి పెళ్ళిచేసారు.

ఉద—పెళ్ళా పెళ్ళి నీకు పెళ్ళా (నవ్వి) నేను నమ్మను. వట్టిది నీవు నన్ను పరీక్షిస్తున్నావు నిర్మలా.

నిర్మ—పరీక్ష కాదు భాను! నీపాద సాక్షిగా నాకు పెళ్ళయింది.

ఉద—నిజంగా నీకు పెళ్ళయిందా. అదర్మ హీనమయిన ఆ పాడు పెళ్ళి ఎలాచేసికో గలిగావు?

నిర్మ—మీ నాన్నగారు, మా నాన్నగారియొక్క నిర్బంధాలవల్ల.

ఉద—నిర్బంధాలవల్లా......నిర్బంధం...ఆడది అబలనే పాటను నీవు బాగా గానంచేసి అబలా శిరోమణి వయ్యావు.

నిర్మ— ఉదయభానూ ఒక్కమాట వింటావా.

ఉద—నువ్వు పదిమాటలు చెప్పినా నాకు విలువలేదు.

నిర్మ—ఎందువల్ల?

ఉద—నీ చేతగాని తనమువల్ల.

నిర్మ—అబ్బ! నా హృదయాన్ని మరింత గాయపర్చకు భాను. ఒక్కమాట చెప్తా విను.

ఉద—నువ్వు చెప్పబోయే ముందు నేను కొన్నిమాటలు అడుగుతాను. సరిగా సమాధానం చెప్పగలవా?

నిర్మ—చెప్పగలను.

ఉద—తెలివైన మానవులు జంతువుచేతనైన దాని కనుచితంగాని కార్యాన్ని చేయించ గలరా?

నిర్మ—చేయించినా దానిలో పూర్తిజయాన్ని పొందలేరు భాను,

ఉద—బావుంది. అయితే యోచన లేని జంతువులకన్నా మానవజాతి హీనమయిందని ఎప్పుడయినా ఎవరయినా ఎక్కడయినా అనడం విన్నావా?

నిర్మ—ఆ మాట వినలేదు గాని ఒక్కమాట విన్నాను.

ఉద—ఏమిటామాట

నిర్మ—మానవజాతి ఉత్కృష్టమైనదని.

ఉద—అయితే అట్టి మానవజాతికి సంబంధించిన స్త్రీవేకదా నీవు.

నిర్మ—అవును.

ఉద—అలాంటి మానవత్వం నీలో ఉండి క్రితం నీ శరీర ఆత్మాధికారాలు ఒకరికి అంకితం చేశాననే జ్ఞప్తి ఉండి అట్టి నిబంధనలు తప్పడం మానవత్వానికి నీచం ఆపాదింప చేయుటమే అనే జ్ఞానముండి కూడా, ఈలాంటి వృద్ధుని వివాహం చేసుకోగలిగావంటె నిన్ను ఏజాతిలో చేర్చాలి? కాలేజీకి వెళ్ళే ముందు చెప్పిన మాటలు ఏం చేశావు?

నిర్మ—భానూ! క్షమించు క్రుంగి కృశించి పోతూన్న నా హృదయ ప్రసూనాన్ని మరింత నలిపి నాశనం చేయడం నీకు ధర్మం కాదు. సత్యాన్ని నీ సన్నిధానాన్ని పెట్టడానికి ఏమీ జంకను. నిన్ను పరిపూర్తిగా ప్రేమించిన మాట వాస్తవమే. కానీ నావయస్సు మించినదనే వక్ర సాకును తీసుకొని ధనాని కాశించి దౌర్జన్యంగా నాకంఠానికి ఒకముసలి హస్తద్వయం చేత ఉరిత్రాడు వేయించారు. మా నాన్నగారు మీకు సరిపడే కట్నం, కానుకలను ఇవ్వలేడనే భావంతో మావయ్యా మూలయ్యానే ముసలి పెళ్ళిళ్ళ దళారీచే ఈ పెళ్ళి కుదిర్చి చావడానికి సావకాశం లేకుండ నన్ను ఈ నీచానికి బంధించారు. ఆశలన్నీ అడియాసలై అధ్వాన్న జీవితంలో

నీ ఆనంద మూర్తిని చూస్తూ ఇలాగే జీవించాలని ఆశించాను. అందుకు అర్హ్వారాలుగా చెయ్యిభాను.

ఉద—ఎంత జరగాలో అంతా జరిగింది నేను ఊహించిన మధుర ఊహా లతికలు, కట్టుకొన్న గాలి మేడలు ఈ నాటితో అంతమైపోయినాయి మనవరా ప్రాయపు ఆనందజీవితా కాశంపై జ్యోతిర్మయమైన సంధ్యాకాంతుల చారలు జారిపోలేదు మమకార మేఘావళి ప్రక్క అనురాగపు టంచుల అరుణ కిరణాలు ఇంకనూ కృంగిపోలేదు. నేనెట్లా మరచేది నిర్మలా.

సీ. అధరంబు కదలిక ♦ పొడరెడి చిరునవ్వు
హృదయాన యేనాడో ♦ ముదము గూర్చె
పసిడి రేకులబోలు ♦ పలుచని చెక్కిళ్ళు
చిటికెల తోడను ♦ చెలగి యాడె
మధుర భావాలలో ♦ మఱచియు మేనులు
ఆనందవీధుల ♦ ఆడెగాదె
రియొండొరుల్ చూడక ♦ యుండిన నిముషము
వత్సరంబు పగిది ♦ వగచినాము

గీ. గతము నాస్తని యీనాడు ♦ గడుపగలమె
చంద్ర చంద్రికస్మే ♦ ఘము శాశ్వతముగ
స్నేహలతికల భేదించి ♦ చేయగలడె
గ్రుడ్డి సంఘము ఈ ♦ రీతి అడ్డగలదె

నిర్మలా ధనికతత్వం ఆదర్శ దాంపత్యాన్ని కొనితేలేదు. అచంచలమైన నా ఆత్మ నిగ్రహాన్ని అవగతం చేసికొనలేక దౌర్బల్య హృదయంతో సంఘ సంకెళ్ళను చేతుల సందశేశావ్, పవిత్ర

మైన నీ మానవత్వానికి అవమానం అపాదింపజేశావ్. కాని నాజీవితంలో

గీ. మనసు లేనట్టి పెండ్లిండ్లు ♦ మాయువరకు
బాలికలకు వృద్ధుల చెర ♦ బాయు వరకు
సంఘవక్రతా గమనంబు ♦ సమయు వరకు
సుఖము కొంతయు నాజీవి ♦ సుంతయైన,

నిర్మ—భానూ, భాగ్యవంతుల బిడ్డను నీకు భార్యగా చేయాలనే మీనాన్నగారి సంకల్పం...ఆసంకల్పా న్ననుసరించినడవడం నీ విధ్యుక్త ధర్మం.

ఉద—విధ్యుక్తధర్మం...విమర్శకు ఆగలేని వివేకమనేది అసలేలేని ఆ విధ్యుక్త ధర్మమేగా నిన్నీగతికి తీసుకువచ్చింది ఆవిధ్యుక్త ధర్మమనే సనాతన శాస్త్రశాసనం ఆధారంగానే కదూ ఎందుకూ కొఱగాని ఆ వృద్ధు నీకుభర్త అయ్యాడు. అతనిబుద్ధి అనే దానికి వికాసముంటే ఇటువంటి క్రూరకృత్యానికి ఒడంబడతాడా.

గీ. ఒడలి జీవనరము లెల్ల ♦ సడలు వేళ
మేను వణకంగ కర్ర పై ♦ నాను వేళ
ప్రాణము తనువుపై రోసి ♦ బాయు వేళ
పరిణయం బాడ గోరెగా ♦ పాడుబుద్ధి

నిర్మలా! ఎడబాటువల్ల విచిత్ర మార్పులతో ప్రజ్వరిల్లుతోంది. నీ ముసలిభర్త మార్లుధ్వనులు విస్పష్టంగా నాకు వినిపిస్తున్నయ్. యాతన మయజీవితం ఎడారిలా వ్యర్థమవుతుంది. ఈ నీపెండ్లిగా నాజీవిత సుగమనానికి మార్గదర్శి కాబోదు.

నిర్మ—అదేమి భాను, ఇంతలో ఇంత మార్పు:

ఉద—పరమోన్నతమైన ప్రేమికుల హృదయాలు గ్రహించడం గగన కుసుమాలు పట్టడం చాలా కష్టం.

నిర్మ—నీమాట లేమిటో ఆశ్చర్యంగా తోస్తున్నాయి, నీవెక్కడుండి మాట్లాడుతున్నావ్ భానూ.

ఉద—ఏవ్యక్తి నా జీవితాధారానికి రెండవచక్రంలా భావించిభూషించానో, ఏవ్యక్తి నా సలక్షణసంసార నౌకకు చుక్కాని అని గురిపెట్టుకొని ఇంతకాలం మురిసానో ఆవ్యక్తి దగ్గర నా జీవనరథం చక్రశూన్యమై పోయింది. నాఆనంద సంసార నౌకకు చుక్కానిలేదు. కానీ అంత మాత్రాన నిస్పృహపడను. సంఘసేవకు సత్వరగమనాన్ని సాధిస్తాను.

(వెళ్ళబోవును)

నిర్మ—(అడ్డువచ్చి) ఆగుభానూ, నీ హృదయ మందిరంలో మరొక సుందరిని సృష్టించుకొని నీ జీవితాన్ని ఆనంద ప్రపూర్ణంగా చేసుకొనలేవా ?

ఉద—మరొక సరస్వతిని సృష్టించు కోవడం ఆ సృష్టికర్తలకే చేతకాలేదని అనుభవజ్ఞులు చెబుతూయుంటారు.

నిర్మ—భానూ! నేను అనాలోచితంగా పెద్దలు శ్రేయోభిలాషులనే భావంతో కన్నకూతురు కంఠాన్ని నులుమ రనే విశ్వాసంతో పితృఆజ్ఞ పరిపాలనే ధర్మమనీ మాఉదారిలో మానవత్వాన్ని స్త్రీసహజత్వాన్ని గోల్పోయినమాట వాస్తవం. కాని యింతవరకు నేను అంతర్భావంగా శీలవతినే. బాహ్యాబంధనా పవిత్రతను భంగపరచలేను. నా కంఠాని కురిత్రాటిని బిగించి భర్తనే పదాన్ని పొందిన ఆ అభాగ్యుని, నీపట్ల నిజంవ్యక్తమైన తర్వాత కంటితో చూడలేను. ముఖ్యాటికి చూడను.

గీ. పెద్దలకు బద్ధురాలై నాకు పెండ్లిసేయ
మోసపోయితి నిక ముందు మోసపోను
జయము పొందగ ప్రతిఫల చర్యజేసి
ప్రాణి పోయిన వృద్ధుని పాలుగాను.

ఉద—బంధీ అయిన తర్వాత పొందాలనుకునే జయం నింద్యంగా పరిణమిస్తుం దేమో ఆలోచించు నిర్మల!

నిర్మ—బంధీ అనేది స్త్రీకి సహజబంధంగా సంఘం శాసించినపుడు ముందులో ఒక స్వేచ్ఛ అనేది ఉందా ఏమిటిభాను, బంధీగా ఉంటూనే బంధనాలను ఛేదించడానికి ప్రయత్నంచేస్తాను. నామనో శాసనాన్ని పరిపాలిస్తాను. వెడతాను. (వెళ్ళబోవును)

ఉద—నిర్మలా.

నిర్మ—(తిరిగి) ఎందుకు భానూ.

ఉద—వీడిపోయేముందు నీహితుని సలహా; నీజీవితాన్ని సుఖవంతంగా చేసుకోవాలంటే నన్ను మరచిపోవడం చాలాముఖ్యం.

నిర్మ—అది నా ప్రయత్నానికి మంచిపనిభానూ, ఆశాజ్యోతిని ఆర్పడానికి ప్రయత్నంచేస్తే ఫలితం అంధకారమేగా, క్షమించు భానూ, సెలవు. (వెళ్ళును)

ఉద—(ఉద్రిక్తంగా) నీచాతినీచమైన సంఘం నిర్మల సౌభాగ్యజీవనానికిభంగం; నేటినుంచి నేసాగించబోయే సమరానికి రంగం.

కీ. ప్రళయ గంభీర జంఝూనిలంబు వీవ
సత్యశరముల సంధించి సంఘమందు
అగ్నికణముల సృష్టించి అధములైన
వారి నెల్లను నాశంబు కోరిచేతు.

( తెర )

2. వ ర ం గ ం

సుబ్బరాయుడి యిల్లు.

3 కుర్చీలు, మూల నొక డస్కు, ఒక డ్రాయరు ఉంటాయి. శశి పాడుతూ సామానును చక్కబెడుతూ యుంటుంది.

మ్రోగించయా, మ్రోగించయా
తేజోమయా, భానోదయా
ఆహా! ప్రభాతభేరిని మ్రోగించయా ॥మ్రో॥
అరుణ కిరణాల్ ధరను మెరసే
కరుణాపూరిత ఉదయభాను
విప్లవకారీ విజ్ఞానభేరీ ॥మ్రో॥
నిశా దేవీ నీలిచరన్
తూటు పర చే తూరుపు రేఖ
ప్రభాశరమై పరుగున తాకెనోయి ॥మ్రో॥

[ప్రసాదు అటూఇటూ బెదురుగా చూస్తూ ప్రవేశం

ప్రసా—(ప్రక్కగా నిలబడి) హాలో శశి. ఒకసారి ఇలారా.

శశి—(జడుస్తూ) ప్రసాదా! అబ్బ,మా నాన్నగారింట్లోనే ఉన్నారు. నువ్వెళ్ళిపో......వెళ్ళాలి బాబూ.

ప్రసా—అరే ఏమిటా వెర్రిభయం. రాత్రి నీగురించి స్టడీస్ మాను కొచ్చాను. కాస్త నా రూంకేసి చూచి రాత్రికి రాలేననే కబురన్నా చెప్పకూడదూ.

శశి—మా అన్నయ్య ఇవాళ వస్తున్నాడు. చావటానికికూడా తీరిక లేనన్ని పనులు. మరోసారి నీ దర్శనం చేసుకుంటా.

ప్రసా—మీ అన్నయ్యంటే మీ పెత్తల్లి కొడుకేకదూ అతనుచది వేది సెకండియరేకదూ. అతన్నెపుడూ నేను చూడలేదే ఒక సారి నన్ను మీ అన్నయ్యకు ఇంటర్డ్యూస్ చేస్తావుకదూ.

శశి—ఇంతవరకూ ఎవరికీ అంటనూ మనంపడలేదు. అంచేత మనకు మనమై పీపులకు బోర్డులుకూడా తగిలించుకుంటే బాగా ఉంటుంది. మాఅన్నయ్యను నువ్వెరుగవూ ?

ప్రసా—ఏదీ నేనీపూట వచ్చేటుందేగా మీఅన్నయ్య కాలేజికి వెళ్ళాడు. కలుసుకునే అవకాశం ఇప్పుడు కలిగింది. (లోపల ధ్వని)

శశి—ప్రసాద్, వెళ్ళిపో మానాన్నగారు వస్తున్నారు.

ప్రసా—అంతా నీభయమే, ఎవరూ రావడంలేదు. ఇలాచూడు. మీ అన్నయ్య సందట్లో నన్ను మరిచిపోకుసుమా. అలా జరిగితే మన్మధుడు నన్ను మసిచేసి పారేస్తాడు. గుడ్ బై... డే ఆఫ్టర్ టుమారో వెయిట్ చేస్తూ ఉంటా. (సుబ్బారాయుడు తెరలో) అమ్మాయీ

శశి—(భయంగా నిమ్మదిగా) అయ్యో ! వస్తున్నారు.

ప్రసా—రానీ (అటూ ఇటూ చూచి వెళ్ళిపోతాడు)

[సుబ్బారాయుడు ప్రవేశం]

సుబ్బా—(అనుమానంగా) ఏమిటీ చప్పుడయింది ?

శశి—ఎలుకపిల్ల మీ దస్తావేజుల డస్కుపైన గంతువేసి గాబరాగా పారిపోయింది.

సుబ్బా—(డస్కుదగ్గరకు వెడుతూ) ఏమిటీ డస్కుదగ్గరనా ఏమూ లన్నా బెజ్జం చేయలేదుగదా,

శశి—(నవ్వు ఆపుకుంటూ) లేదు. మీరు రావడం చూచి పారిపోయింది.

సుబ్బా—దానిదుంప తెగిపోనీ, నువ్వు ఇంట్లోపనులుచూడు. బహుశా అన్నయ్య ఈ బండికే దిగుతాడనుకుంటా. వెళ్ళొస్తా

(శశి వెడుతుంది)

సుబ్బా—(దస్కు తెరచి ఒక నోటు తీసి) ఆన పందొమ్మిదివందల సంవత్సరము ఏప్రియల్ మొకటి తేదీని ఆ నోటు కాలదోషం పట్టిందే (వెనుక త్రిప్పి) లేదు చెల్లు పడింది.

(తెరలో మూలయ్య) సుబ్బారాయుడు అన్నగారూ!

సుబ్బా—(కాగితాలు కంగారుగా సర్దుతూ) ఎవరోయి ఈతమ్ముడు? పానకంలో పుడకలాగున చక్కావచ్చాడు. ఎవరు నాయనా?

(తెరలో మూలయ్య) మూలయ్యనండీ.

సుబ్బా—ఓహో ముసలిపెళ్ళిళ్ళ మూలయ్యగారా? దయచేయండి దయచేయండి.

మూల—(ప్రవేశిస్తూ) అదేమిటండో కొత్తపేరు ప్రసాదించారు.

సుబ్బా—కొత్తపేరేముంది? మూలయ్యగారనేది పాతపేరేగా. మధ్యగా నిర్మల పెళ్ళిచేసినప్పటినుంచి పరిపాటుపడంగా ముసలిపెళ్ళిళ్ళ మూలయ్యనేది స్థిరమైపోయింది. పదండి.

మూల—ఇంతవరకూ మీప్రోద్బలమంటూ లేకపోతే ఆపెళ్ళిమాత్రం నేను చేయించగలనంటారా.

సుబ్బా—ఊరికే అన్నానులెండి (అనుమానంగా) అసలు తమరిలా దయచేయడానికి కారణం.

మూల—(సంశయముగా చేతులు నలుపుకొంటూ) ఏదో పిల్లలుగల వాడ్ని కదండీ. ఆనిర్మల పెళ్ళికుదిరిస్తే ఇస్తానన్నరొఖ్ఖం ఇంతవరకూ ముట్టలేదు. ఏదోదయఉంచి.

సుబ్బా—అదేవిటండీ మూలయ్యగారూ! ఎవరోపిల్లకు పెళ్ళేమిటి? నేను తుదకు రొఖ్ఖం చదివించుకోవటమేమిటి?

మూల—అంతలోనే అంత మరుపైతే ఎలాగండీ ఎవరో పిల్ల ఏమిటి. తమ బావమరిది కూతురు. మీ అబ్బాయిని ప్రేమించి పెళ్ళాడటానికి కూర్చున్నపిల్ల. పేదవాడైనా పాపయ్య ఏమీ ఇవ్వలేడని అబ్బాయి కంతగా కట్నము రాదనిన్నీ పాపయ్యకు

డబ్బు ఆశ చూపించి మరొక సంబంధం చూడమని అలాజరిగి నట్లయితే వందరూపాయలు మీరిస్తారని ఆనాడు వాగ్దానం చేయలేదూ.

సుబ్బా— ఏదో అన్నానుగాని అంతవరకు ఇచ్చుకోగల నంటారా? మూలయ్యగారూ! మీకుకూడా ఏమి లోటులేకుండా అటో వంద ఇటోయాభై అర్పించుకున్నారుగా సరే అన్నాను. కాబట్టి మా అబ్బాయి పెళ్ళికూడా తమకృషిమీదనే మంచి కట్నము వచ్చేటట్టు చూడండి. అప్పుడే ఇచ్చుకుంటా నావంద.

మూల— బావుందికదండీ; సత్యనారాయణవ్రతములో సాహుకారు అబ్బాయి పిల్లపుట్టినతరువాత బారసాలనాడు ఇస్తానన్నారు.

సుబ్బా—అంతమాటే ఎందుకంటానండి? అలాఅన్నానంటే తు. చ. సరిగా అక్షరాలా జరగవలసిందే. యింతకూ అబ్బాయి పెళ్ళి విషయంలో తమకు శ్రద్ధ ఉండదేమోనని అలా అన్నాను కాని మరోవిధంగా మీరు భావించద్దు.

మూల—భావించేదేముంది లెండి. అయితే అబ్బాయిపెళ్ళి ఈ సంవత్సరమే కానిద్దామనా మీఉద్దేశం.

సుబ్బా—అవునన్న సంబంధం ఉంటే తక్షణంగా చేస్తాను.

మూల—ఈవిషయంలో అబ్బాయితో ఏమీ సంప్రతించ నక్కర లేదా?

సుబ్బా—ఏమీ అక్కరలేదు. నే నెలా చెబితే అలానే వింటాడు.

మూల—ఒక వేళ వినకపోతే.

సుబ్బా—అదేమిటండీ మూలయ్యగారూ నా మాట వినకుండా ఏ చెరువులో నీటిని తాగుతాడు ఒక్కక్షణం ఇంట్లోఉండగలడా?

మూల—తమమాటకు తిరుగుండదనుకోండి కాని కాలేజీలో కాలు పెట్టినవాళ్ళతో ఘట్టిచిక్కేయిది.

సుబ్బా—నేను చెప్పిన మాటకు మా వాడు ఏనాడూ ఎదురాడడు. యింతకూ మా వాడుకూడా ఈ వేళ వస్తాడు. అదికూడా తేల్చుకుందాం. అసలు మీదృష్టిలో మావాడికి తగ్గ సంబంధం ఎక్కడైనా ఉందాఅని...

మూల—తీకేం, కావలసినన్ని మొన్న బందరునుంచి వచ్చిన సంబంధం ఏమైందండీ?

సుబ్బా—అన్నట్టు మరచాను; మీతో చెబుదా మనుకున్నాను సుమండీ.

మూల—యిప్పుడైతేం లెండి చెప్పడానికి సమయం మించ లేదుగా.

సుబ్బా—అయితే వినండి. అమ్మాయిచాలా బావుంటుందట. మాట్లో వినయం కయ్యాం కుయ్యాం అనిపిస్తుందట. యింగ్లీషు భాషకూడా కాస్త ఎంగిలిపడ్డదట. అన్నివిధాల అబ్బాయికి తగ్గఅమ్మాయి.

మూల—అయితే అడ్డి పోవటానికి కారణం?

సుబ్బా—అదేకదండి చెబుతున్నాను అసలు కట్నందగ్గరే వాళ్ళు వాళ్ళు తడబడ్డాయి. పదివేలరూపా లయితేనే మాట్లాడమన్నా లేదంటారా లేవమన్నా, ఎనిమిది వేలవరకు వచ్చి వెనక్కు తిరిగారు.

మూల—అబ్బ! పదివేల రూపాయలే.

సుబ్బా—ఏం అంత కట్నం మావాడికి రాదనా మీఉద్దేశ్యం.

మూల—రాకేంలెండి, సరుకుమంచిది కావాలి; సరాసరి డబ్బా కావాలంటే చాలకష్టం. ఏదోఒకటి లోపిస్తుంది.

[అబద్ధం బూడిద మొగంతో ఏడుస్తూ ప్రవేశం]

సుబ్బా—అదేమిటిరా నీమోహంమండ ఆ అవతారం ఏమిటీ అంట.

మూల—వరహావతారమండీ వరహావతారం,

అబ—యె...యెల్లేముందు ఎ ఎ ఎకవముండ ఎ ఎదురొచ్చిందండీ.

సుబ్బా—యింతకూ ఏంజరిగిందో చెప్పేడవరా.

అబ—(బెడ్డింగు, పెట్టి క్రిందపెట్టి) నేను ఆ—అరలు ఏ ఏమూవరగ నండి యె...యెనకపాటున వచ్చి త...తలతో పొడిచిందండి బో...బోర్లాపడిపోయానండి. (ఏడుస్తూ) మాఅమ్మకు నేను ఒక్కడనే కొడుకునండి. మాబాబుకు ఆడపిల్లైనాపుట్టలేదండి.

మూల—ఒరేవ్ నీమోహాంఈడ్చ. చెప్పన్నా యేడుయేడ్చన్నా చెప్పు.

అబ—మరేనండి యె...యెదవేనండి. యెదవేగాకపోతే నా... నామీాదపడి యెందుకేడుత్తుందండి, అసలుసంగతి స...సరిగ్గా చెబుతా ఇనుకోండి. నే నేను రోడ్డే వత్తున్నాననుకోండి. మీా...మీాలాగ బస్ ఉందనుకోండి ఆ...ఆ యెదురుగా మూ...మూలయ్య గారిలాగే ఒక గా...గాడిదనుకోండి ఆబస్ బారు బా...బారు అని కూసిందండి. మూలయ్య లాగున్న గాడిద బె...బెదిరిపోయి ఆపళంగాను కా... కాండ్రు...కా...కాండ్రు.

సుబ్బా—(చెవులుమూసికొని) అబ్బబ్బా ఆ వెధవగోల ఆపరా నాయనా.

మూల—అయినా నేను గాడిదనంటూ మీారు బస్సంటూ ఏడుస్తా రేమిటండీ యీఅడ్డగాడిద.

అబ—నేను కాబట్టిబతికిబ...బయటపడ్డాను కాని మూ...మూలయ్య గారైతేంట...టపా కట్టెయ్యవల్సిందే గం...గంటసుమారు మా—మాటలేకుండా పడిపోయానండిమరి.

మూల—అదేవిటండీ సుబ్బారాయుడుగారూ ఈవెధవ నామీాద యుద్ధం సాగిస్తున్నాడు.

సుబ్బా—(కోపంగా సంజ్ఞచేస్తూ) ఒరేయ్, నువ్వు అవతలకు పోరా. యిక్కడ లేవేం వెధవమాటలు నువ్వను.

అబ—మరేనండి అబ్బాయిగా రొత్తున్నారు. (నిష్క్ర)

మూల—అయినా ఏమిటండీ సుబ్బారామయ్యగారూ! యీలాంటి అష్టవక్రగాడిని కొడుకుల్ని నౌకర్లుగా పెట్టుకోవడం నలుగురిలో నామోషీ కదండీ.

సుబ్బా—ఆడదిక్కులేని సంసారానికి వాడు కాబట్టి సరిపోతోందండీ. ఎంత చెవిటివెధవైనా తెలివిలో అఖండుడు.

మూల—మీరిచ్చే జీతమెంతండీ వీడికి?

సుబ్బా—ఒంటినిండా బట్ట, పొట్టనిండా తిండి.

మూల—బాగా సెలవిచ్చారు. మీరుమాత్రం సామాన్యులా (సామానులుచూచి) అబ్బాయి బండిదిగినట్టుగా ఉన్నాడే.

సుబ్బా—దిగాడు లేకపోతే యీబెడ్డింగు యీసూటుకేసు ఎక్కడివి? మూలయ్యగారూ మనలో మనమాట, అబ్బాయి కంతకట్నం యిచ్చేవారే దొరకరంటూరా?

మూల—అదే నాకూ వచ్చిన సందేహం.

సుబ్బా—అయితే బందరువాళ్ళకు ఉత్తరం రాసెయ్య మంటారా యేమిటి?

మూల—ఎందుకండీ! అంతకంగారు నేనున్నానుగా వాళ్ళచే తేపది వేలరూపాయలు ఘల్లుమనిపిస్తా.

సుబ్బా—శేష్ మూలయ్యగారు! మీరుండగా నాకేం భయం లెండి.

[ఉదయభాను ప్రవేశం]

మూల—అదుగోనండి అబ్బాయి వచ్చాడు.

సుబ్బా—వచ్చాడూ ? ఏంనాయనా ! యింతఆలస్యంగా వచ్చావు ?
మధ్యగా స్నేహితుల యింటివద్ద మకాంచేశావా యేమిటి ?
మొఖమంతా అలా శుష్కించిపోయిం దేమిటినాయనా

ఉద—(మాట్లాడడు)

మూల—బాబూ! అరవవాళ్ళకూకు అజీర్తికి మూలమంటారు పెద్దలు.
ఆయిబ్బంది లేకుండా అన్నంసాక్షీగా అరిగిచక్కాబోతోంది ?

ఉద—భాషా భేదానికి స్థానం యిచ్చి ఈర్ష్యతో వుండే వాళ్ళకు ఆ
అజీర్తిరోగం తప్పని సరిగా పట్టుకుంటుంది. నాకాభేదమూ
లేదు. ఆరోగమూ లేదు.

మూల—బాగా చెప్పావు బాబూ.

సుబ్బా—ఏరోజు కారోజే ఏబండికాబండే వస్తావని అబద్ధాన్ని ఎంత
శ్రమపెట్టాననుకున్నావ్.

ఉద—అబద్ధాన్ని అంతశ్రమపెట్టకపోతే యీ సామాన్లు ఒకణా
యిచ్చి కూలివాడినెత్తిన పెడుదునుగా.

సుబ్బా—అణాడబ్బులా, అణాడబ్బులు, డబ్బువిలువ నువ్వింకా
గ్రహించ లేదురా అబ్బాయి.

ఉద—ఎంతవిలువైంది, లేకపోతే పాపయ్యమామ బంగారంలాంటి
నిర్మలను ముసలివాడికి కట్టబెడతాడూ ?

మూల—మహాబాగా చెప్పావు నాయనా నీకూకూడా తెలిసింది. మహా
చక్కటిసంబంధం,

సుబ్బా—ఈమూలయ్యగారే ఆ పెళ్ళికుదిర్చింది.

ఉద—(ఎర్రగా చూస్తూ) మీరేనా ?

మూల—మీ నాన్నగారి ప్రోత్సాహంవల్ల మా అనుగ్రహంవల్లనూ.

సుబ్బా—యింతకూ నీకూకూడా చక్కని సంబంధం తీసుకురావా
లని ప్రయత్నిస్తున్నారు.

ఉద—పాపం, ఎంతసానుభూతి!

మూల—ఇంతింతా నాయనా! మీా కుటుంబమంటేనే నాకాదినుంచి అమిత గౌరవం.

ఉద—అహా. అలానా?

సుబ్బా—పైగా పదివేలరూపాయల కట్నంతీసుకువస్తానని ప్రతిజ్ఞ చేశాడురా.

ఉద—అబ్బ ఎంతధైర్యం!

మూల—ఇంకా ప్రతిజ్ఞంటూ చేయలేదు. కాని ప్రయత్నంమాత్రం చేస్తానన్నాను.

సుబ్బా—ఎంతమాట మూలయ్యగారూ! పదివేలరూపాయలకుతక్కువైతే మావాడికి పెళ్ళిచెయ్యను. సరుకు మంచిదైతేధరఎప్పటికైనా చక్కారావలసిందే.

ఉద—మానాన్నగారు నన్ను చదివించడంలో ముఖ్యకారణంకట్నం గురించేనండి.

మూల—మహాబాగా గ్రహించావుబాబూ. నిన్ను జాగ్రత్తగా పెంచడంకూడా అందుకే.

ఉద—అందుకే నేనొక చక్కని మార్గం చెబుతాను అలాచేయండి నాన్నగారూ.

సుబ్బా—(ఆశగా) ఏవిటిరా నాయనా అది?

ఉద—ఏముంది వచ్చే శివరాత్రికి నన్నుబాగా అలంకరించి తీసుకు వెళ్ళండి.

సుబ్బా—ఎందుకూ?

ఉద—ఎందుకేమిటి? గుర్రాలఅమ్మకం మార్కెట్టులో నన్నుకూడా పెట్టండి ఖరీదైన కాశీగుర్రాలుకూడా వస్తాయి అందులో ఒకవిలువైన గుర్రంలా అమ్ముడుపోతాను.

మూల—మహాభాగా చెప్పావునాయనా సమాధానం.
సుబ్బా—అలా అనటంలో నీఉద్దేశ్య మేమిట్రా ?
ఉద—(విసుగ్గాలేచి) విసిగి వేసారి వచ్చినవాకు విశ్రాంతి లేదు గాని
వివాహాలు కట్నాలు విరివై పోయాయ్.
సుబ్బా—(కోపంగా) అంటే పెళ్ళివిగురించి మాట్లాడడం నీకు పెడస
రంగా ఉందా.
ఉద—పెళ్ళా, ఎందుకూపెళ్ళి ?
సుబ్బా—సంసారం చేసుకోడానికిరా.
మూల—చక్కటి బిడ్డల్ని కనమనికూడా.
ఉద—అంతవరకే మీ ఆలోచనలు. పెళ్ళిఎందుకో ఏసూత్రంమీద
ఆధారపడిఉందో మీ కర్థం కావు.
సుబ్బా—ఏసూత్రం ఏమిటిరా నీ మొఖం, మంగళసూత్రం.
మూల—అదికాందహోయ్, అబ్బాయనేసూత్రం. సుబ్బారాయుడుగారి
కాముసూ...... (కోపంగా చూస్తున్న ఉదయభానుని
చూచి) ప్రేమసూత్రం.
ఉద—అవును ప్రేమశూన్యమైన పెళ్ళిళ్ళు యువతీయువకుల హృద
యాలను తూట్లు పరచేబల్లాలు.
సుబ్బా—ఓరి నీమొహాం ఈడ్చ, ప్రేమకు పెళ్ళెందుకురా, ప్రేమట
ప్రేమ.
ఉద—మీతో సంభాషించి పొందేఫలితం పూర్ణానుస్వారం, పెళ్ళట
పెళ్ళి; నా నన్నన్న
సుబ్బా—ఏమిట్రా ఏమిటి ఆపేలిందేమిటో తెలుగులో పేలరా,
ఉద—(వెనక్కుతిరిగి) నాకుమీ రేమీ పెళ్ళిచెయ్యనక్కరలేదు
నేనేమీ చేసుకోడానికి ఉద్యుక్తుడను కావటమూ లేదు.
(నిష్క్రమణ)

సుబ్బా—(కోపంగా చూస్తూ ఉండును)

మూల—(హేళనగా) ఏమీ అక్కర్లేదు. నేనిలా చెబితే అబ్బాయి అలానే వింటాడు. అబ్బాయి.

సుబ్బా—(కోపంగా) ఏమిటండీ మీఅరనేది?

మూల—(త్రుళ్ళిపడి) అబ్బెబ్బే ఏమీ లేదండీ అబ్బాయి మీరు చెప్పిన మాట వింటా డనుకున్నాను. వినకుండా వెళ్ళి పోయాడేమో అని వెర్రిగా అలోచిస్తున్నాను.

సుబ్బా—వినడు, ఎందుకువినడో నేనూచూస్తానుగా వాడిపెళ్ళయినా చేసితీరాలి, యింట్లోంచి వెళ్ళ గొట్టాలి.

మూల—మీ ప్రతిజ్ఞ ఎంతవరకు పాలిస్తారో నేనూ చూస్తానుగా.

సుబ్బా—నేను ఏదో ఒకటి చెయ్యకపోతే నా పేరు సుబ్బారాయ్డు అని పిలవకండి. వాడి పట్టుదల ఎంతవరకో నేనూ చూస్తాగా (నిష్క్ర)

మూల—(వికటంగానవ్వి రెండవప్రక్కకు వెళతాడు)

( తెర ).

---

# శి వ రం గం

## సుబ్బరాయునియిల్లు

2 కుర్చీలు, డ్రాయరూ, పుస్తకాలషెల్ఫు ఉంటాయి.

[ఉదయభాను పుస్తకం ఆలోచన పూర్వకంగా చదువుతూ ఉంటాడు, నెమ్మదిగా శశిప్రవేశం]

శశి—ఏమిటన్నాయ్ చదువుతున్నావ్?

ఉద—(పుస్తకం మూసి) ఆడవాళ్ళ అభాగ్యస్థితి. శాస్త్రరీత్యా విధవా వివాహాలు చెయ్యొచ్చునని ఉంది. పైగా ప్రేమించుకొన్న వాళ్ళే వివాహం చేసుకోడం ధర్మసమ్మతమని కూడా ఉంది. కాని ప్రస్తుతం వివాహవిషయాల్లో ఈ సత్యం మరుగుపడింది. ఆ మరుగుపడిన ధర్మాన్ని పైకితీసి ప్రజలకు చూప ప్రయత్నమే ఈ గ్రంథరూపం ఇది వ్రాసినవారు కందుకూరి వీరేశలింగం పంతులుగారు.

శశి—వీరేశలింగం పంతులుగారంటే

ఉద—ఆయనే సంస్కరణలో ఆంధ్రదేశానికి ఆరని ఆదర్శజ్యోతి, ఆడవాళ్ళ దుర్గతినీ వాళ్ళపతన జీవితాన్ని జూచి పరిశోధన చేసి, మధ్యస్థంగా పుట్టిన శాస్త్రాల ప్రతిసృష్టి తప్పుడు వాఖ్యానాలును ఖండించి, విధవావివాహం ధర్మం అనే సత్యాన్ని వేనోళ్ళచాటిన ధీశాలి.

[సుబ్బారాయుడు ప్రవేశం]

సుబ్బా—ఇప్పటికైనా ఒకనిర్ణయానికి వచ్చావా?

ఉద—లేదు.

సుబ్బా—కారణం

ఉద—ఇష్టం లేక.

సుబ్బా—ఇష్టం లేదూ, నీమనస్సు మారుతుందేమోనని రెండు రోజులు చూచాను. ఇకలాభంలేదు.

ఉద—ఏంచేయమంటారు?

సుబ్బా—ఒక్కక్షణం నా యింట్లో ఉంటానికి వీల్లేదు నీలాంటివాడు నాయింట్లో ఉంటానికి అర్హుడు కాదు.

ఉద—ఎక్కడికి వెళ్ళమంటారు?

సుబ్బా—ఫో, నీయిష్టంవచ్చినచోటికిపో (మీదకు వెళ్ళబోతాడు)
శశి—(అడ్డుగావచ్చి) ఆగండి నాన్నగారూ, అంతకోపం చూపకండి అన్నయ్యమీద.
సుబ్బా—నువ్వూ పెద్దతీర్పరిలా చెప్పొచ్చావు. నాకుకోపం వచ్చిందంటే నీబ్రతుకుకూడా యిలానే కాలిపోతుంది. జాగ్రత్త పోవేం. యిహాఎందుకురా అలా గుమ్మంలో నిలుచున్నావు?
ఉద—నాకు యీ యింట్లో ఉండటానికి పరిపూర్ణమైన హక్కుంది. నన్ను మీరుగెంటి సాగనంపలేరు: కాని నాకు నేనే యీ నిశాచర భూయిష్టమైన యింట్లో ఉండలేక వెళ్ళిపోతున్నాను. (వెళ్ళబోవును)
సుబ్బా—ఒరేవ్ వెళ్ళే వాడవు ఎలాగూ వెళుతున్నావు. నీజన్మలో యీయింట్లో అడుగుపెట్టనని ప్రమాణం చేసి మరీ కాలం కదుపు.
ఉద—మీరు పొమ్మంటున్నారు పోతున్నాను. మీరు రమ్మనేవరకు రానని తప్పనిసరిగా ప్రమాణం చేస్తున్నాను.
సుబ్బా—అయితే ఇట్లైనా విడుస్తావుగాని పెళ్ళాడదలచుకో లేదన్న మాట.
ఉద—ఆమాట తమకు క్రితమే నివేదించుకున్నాను.
సుబ్బా—(ఆక్షేపణగా) క్రితమే నివేదించుకున్నావూ. అలా నివేదించుకోడానికే నేమిట్రా అంతవాడ్ని యింతవాడ్ని చేసింది. తల్లి లేకపోయినా తల్లి తండ్రి నేనే అయి తప్పుడు భాగ్యం నానెత్తిమీద పడతావని పెంచి ప్రవీణుణ్ణి చేసింది ఇందుకేనట్రా.
ఉద—మీరు పెంచి పెద్దజేసింది కాదనడం లేదు. మీరు నాపై చూపిన పుత్రవాత్సల్యాన్ని జీవితాంతంవరకు మరువను.

కాని నా మానవత్వాన్ని మభ్యపెట్టడానికి మీరు చేస్తున్న ప్రస్తుత ప్రయత్నం చాలా నీచమైనది. ఎన్నడూ, ఎప్పుడూ ఎరుగని ఒక బాలికను తీసికొనివచ్చి బలాత్కారంగా నాకు కట్టసంకల్పిస్తున్నారు. సత్యకాంక్షి అయిన యే యువకుడు ఈ దురంత కార్యాన్ని మంచిగా భావించి అంగీకారన్ని సూచించలేడు.

సుబ్బా—ఫో, వెధవా! పెద్ద ఉపన్యాసకుడిలా ప్రారంభించావు. నీ ఉపన్యాసం నువ్వూను. నీకు బొట్టుపెట్టి మళ్ళీపిలుస్తానని భ్రమిస్తున్నట్లుగా ఉన్నావు అలాంటి అప్రతిష్ఠవుపని నా జన్మలో చేయనని గ్రహించు:

ఉద—గ్రహించాను. మీరు నన్ను ఏమీ తూలనాడ నక్కర లేదు. నాలో మానవత్వం ఉంది. పశుప్రవృత్తి ఈవరకే నాశనమై పోయింది. ఆత్మబుద్ధి సుఖం చైవ అనే సత్యనినాదాన్ని అందు కుని ఆవలకు తప్పనిసరిగా వెడుతున్నాను. నావల్ల మీహృద యానికి బాధకలిగితే క్షమించండి.

సుబ్బా—ఓరీ ! చవటా, ఎంతటి వాడ వయ్యావురా (గద్గదికంగా) నీ మొఖంచూట్టం మహాపాపం, నువ్వు నా కొడుకువి గావు. అసలు నాకు కొడుకే పుట్టలేదనుకుంటాను. బాకీ తీర్చుకో వల నుండి ఇంతకాలం నాయింట్లో కూర్చున్న విరోధివిరా. నీఋణం తీర్చుకున్నావు. వెడుతున్నావు. వెళ్ళు. ఇక నాయింట్లో యేలాపాఠం పెడతావో నేనూ చూస్తాను.

(నిష్క్రమింమును)

ఉద—(నెమ్మదిగా నడుస్తూ ఉంటాడు)

శశి—(అడ్డుగావచ్చి) అన్నాయ్ ! ఇలా అందర్ని విడచివెళ్ళటం ధర్మంగా ఉందీ ?

ఉష—ఎందుకు ధర్మంగాదు? చెల్లాయ్.

శశి—నాన్నగారు ఏదో అన్నంత మాత్రాన్ని కోపంతో ఇల్లు విడిచి వెళ్ళటం మంచి దేనంటావు?

ఉష—అమాయిక చెల్లాయీ, అది కాదు. నాకోపం నాన్నగారిమీద కాదు నీచయుత యోచనా శూన్యమైన నీ యీ విధవా కారాన్ని ఎవరిచ్చారో విధవకు పెళ్ళిలేక శూన్యమని ఎవరు శాస్త్రాలు లిఖించారో అట్టివారిమీద ఆ అజ్ఞానపథాన్ని సుజ్ఞానమయం చేసి నూతనసంఘాన్ని సృష్టించి స్త్రీస్వాతంత్ర్య జ్యోతులను ఆ బాటల్లో అలంకరించ సంకల్పంతో ఆవలకు పోతున్నాను. అది నా ఆత్మ ప్రబోధం.

శశి—అయితే నీతో నేనుకూడా వస్తా నన్నాయ్.

ఉష—వద్దు శశీ! నీవువచ్చే సుదినంకోసం ప్రయత్నం చేస్తాను.

శశి—అంటే?

ఉష—నా మూగఖడ్గహృదయ కవాటాలను ఏశక్తి తట్టి నన్ను మేల్కొల్పిందో ఆశక్తి అభివృద్ధియై నా ఉద్యమం బలపడిన తర్వాత పరివర్తనా హృదయం కలిగిన మంచి యువకుని చూచిన శిరోపరిభాగాన్ని ఆశీర్వాదశుభాక్షతలు విరజిమ్మి సుమంగళినిగా చేస్తాను.

శశి—అయితే అన్నాయ్, నీకింత ధైర్యం కలగడానికి ఆధారమేమిటి?

ఉష—స్త్రీలోక దుస్థితి ఉదాహరణగా చెప్పాలంటే ఒకటి నీజీవితం, రెండు నిర్మల దుర్గతి. చిన్ననాడే భర్తను గోల్పోయి చిగురులేని మోడుప్రాయంలా నీవు వయసుతో వృద్ధువిపలలోపడి బోనులో శుష్కించే కిశోరసింహంలా ఆమె ఈ రెండే నా

హృదయ పరివర్తనకు ప్రబల కారణాలు, ఇవన్నీ పురుషుని స్వార్థపు ప్రకటనాచర్యలు. ఇందుమూలంగానే అనేక స్త్రీల రక్తస్రవంతులు.

సీ. అబలంచు శాసించి అంధురాలిగ జేసి
పూరుషుండిల కడు పూజ్యుడంచు
ధర్మశాస్త్రములందు దయమాలి వర్తించి
చేత బొమ్మపగిది స్త్రీలనుంచి
ముసలికి బాలిక యసువులు బలిసేయ
తాతలే మూర్ఖులై తాళిగట్టి
విధవల పెండ్లిండ్లు విజ్ఞానపూజ్యంబు
లంచు చెప్పినవారి నణచివైచి
గీ. కఠినమానస సంపత్తి కలిగినట్టి
సంఘమను నాట్యకత్తెకు సరసులగుచు
స్త్రీలగుండెల నాట్యంబు జేయుచుండి
సంఘనాయకు లీగతి సాకుచుండ్రి.

శశి—ఆడదానికి మళ్ళీ పెళ్ళి చేస్తే అవమానకరం గాదూ!

ఉష—పిచ్చితల్లీ! నువ్వు చెప్పిన ఆ ఆచారం ఆడవాళ్ళకే గాని మగ వాళ్ళకు లేదూ.

శశి—వారికి లేదు. అది ఆచారం; దాన్ని తిరస్కరిస్తే పాపానికి మూలం కాదూ.

ఉష—ఈ ఆచార శాసనాలు, ఈ శాస్త్రాలు ఈ పాప అపోహాలు ఎవరి సృష్టో విమర్శిస్తే, మీ ఆడజాతి దుర్గతి బోధపడు తుంది చెల్లాయ్.

శశి—ఆ శాస్త్రాలన్నీ దేవుడు వ్రాసిపెట్టిన వటగా,

ఉద—దేవుడు, ఆ దేవునకు ఆకార వికారాలేవీ, అనేక వత్సరాలు అఖండంగా తపస్సుచేసి ఆధ్యాత్మికాన్ని అపారంగా అర్థం చేసుకొన్నతపశ్శాలురు. ఆ దేవుని కిచ్చిన ఆకారం యేమిటి? నిర్వికారం. శూన్యమైన ఆ దేవుడు చేతులతో శాస్త్రాలు లిఖించాడంటే అర్థమేముందన్నా.

శశి—(ఆలోచనగా) అర్థం లేదన్నమాట, నాకు పూర్తిగా అర్థమైంది. కాని చీకటితో నిండిన ఈ లోకం నీ హృదయంలో ఆదర్శ జ్యోతి కాంతిని జూచి కళ్ళనీళ్ళు కారుస్తుందేమో.

ఉద—అయితే దాని కల్మషపు కంటినీరు పోయి కళ్ళు తేటబడ తవిలే చెల్లాయి. నా ఉద్యమానికి నీవు ఆచరణయుతంగా ఏకార్యం చేసినా సంతోషిస్తాను. ఈ సంఘానికి గుణపాఠం చెప్పే చర్యను మరీ అభినందిస్తాను. ఇదే నా ఆఖరి సలహా. అపార్థం చేసుకోకుండా ఆదర్శ వివాహాన్ని చేసికోడానికి ప్రయత్నం చెయ్యి.

శశి—అన్నాయ్. ఈలాంటి ఉద్బోధ వల్ల నీ ఉద్యమానికి కష్టం కలుగుతుందేమో.

ఉద—ఆత్మ విశ్వాసంతో ముందడుగు వేస్తున్న నాదృష్టిలో ఆటంకాలు అల్పం, పరికిమందు పోయడానికి నీవేమీ ప్రయత్నం చేయవద్దు. ఇంట్లోకి వెళ్ళు. ప్రోత్సాహ కరమైన విజయ నాదిక దుందుభులు నన్ను ఆహ్వానిస్తున్నాయ్. ఉత్తుంగ తరంగాలపై నావిజయ నావిక ఊగులాడుతోంది. ఉద్యమ ప్రారంభం కోసం నా హృదయం ఉద్రూత లూగుతోంది. ఇదే శుభ ప్రభాత శోభి అనుసమయం పంకిలమయ పంథాన్ని పటాపంచలు చేసే ప్రయాణ సన్నాహం.

గీ. భగ్నపడిన నాహృది బాధపడిన
లెక్కసేయను నే నెంత బక్కమైన
ఆత్మ విశ్వాస దృఢమతితో యాచరింప
సాగిపోయెద జయభేరి మ్రోగజేయు

నిష్క్రమించును.

(తెర పడును)

---

## 4 వ రంగం

### ప్రసాదుగది

[డ్రాయరు, కుర్చీ, డ్రాయరుపై పుస్తకాలు, లైటు క్యాంపు కాటు.]

[ప్రసాద్ లైటు పెద్దదిజేసి పుస్తకము తెరచి చదవటానికి ఉపక్రమిస్తాడు. చదవలేక ప్రేమగీతాలు ఆలాపన చేస్తూ ప్రక్కకు చూస్తూ అటూఇటూ తిరుగును.]

ప్రసాద్—యింకారాలేదేం చెపుమా (ఆలోచించి) డిజెప్పాయింటమెంటులాఉందే (లోపల అడుగుల చప్పుడు చూచి) ఆల్ రైట్ (పడుండి నిద్రపోవునట్లు నటన)

[నల్లముసుగుతో శశిప్రవేశం]

శశి—(నెమ్మదిగా తలపై ముసుగు తప్పిస్తుంది)

ప్రసా—(తుళ్ళిపడి వింతశబ్దంచేస్తూ అటుతిరుగుతాడు)

శశి—మొద్దునిద్ర; పెద్దకబుర్లుమాత్రం చెబుతావు.

ప్రసా—(నిద్దట్లో నటనగా) ఎంతకాలమే శశీ యీనిర్బంధం,

శశి—(ఆశ్చర్యంగా) పలవరింతల్లాడున్నావే ఎవర్నిగురించో,

ప్రసా—అబ్బ! మేఘంలో మెరుపులా పుష్పంలో సౌరభంలా, వేసవిలో తొలకరిలా మధురాతిమధురంకదే నీ ఆగమనం

శశి—(ఆనందంగా) నా గురించేనా అబ్బ.

ప్రసా—సంఘురక్వం నిన్ను చవిచూచి అనాఘ్రాతప్రసూనం చెయ్యాలని ఆశించింది, ఆకుసుమాన్ని నేను అందుకున్నాను. నా జీవితం ధన్యమైంది.

శశి—(అర్ధనిమీలితంగా) నా జీవితంకూడా ధన్యమైంది ప్రసాద్.

ప్రసా—బాహ్యంగా మనం భార్యాభర్తలుగా సంచరించే సమయం కాలేదూ ?

శశి—ఏమిటా హృదయవేదన నిద్దట్లోకూడా నాతలపే.

ప్రసా—ప్రపంచాన్ని పరవశపరచే ప్రేమాధిదేవత నన్ను పసిపాపనుగా చేసింది.

శశి—(పరవశంగా) నన్నా అంతే. అబ్బ ఎంత ఆనందమయంగా నా హృదయం ముగ్ధత్వం పొందుతుందోయీ.

ప్రేమికా, ప్రేమికా, ప్రేమికా మధురమోహాన మోయీ
హాయి, హాయి, హాయి సుఖదాయి
ప్రేమసుమాలా డోలీఊగగ తనువుగ ఊరటజెందెను ॥ప్రే॥
నిదురలో నాడగు భావనమెరసెనా, పదములు తడబడె
ముదమును కనుగొనలేవో, లేవో రావో॥

ప్రసా— (లేచి, వెనుకనుంచి రెండుచేతులు పైన వేస్తాడు)

శశి—(తుళ్ళిపడి) బాగుందికదూ, ఏమిటా అల్లరి.

ప్రసా—(నటనగా) ఓ నేనేనా (అద్దంలో తనముఖంచూచుకుంటూ) ఏమిటాఅల్లరి నీ ఆహ్వానా న్నందుకొని ఒక ఆడమ్మాయి వస్తే ఆవిధంగా అల్లరిచేస్తావూ.

శశి—(నవ్వాపుకుంటూ) నిద్దట్లో నిజాన్నంతా వెల్లడిచేసే నీతివం తులప్రక్కని ఎవరైనా ఉంటే...

ప్రసా—ఉంటేతంటా? నిజాన్నంతా తెలిసికొని నీకు నన్ను ప్రజంటు చేస్తారు.

శశి—నీకు నన్ను ప్రజంటుచేస్తారో మనవీపులు శుద్ధిచేస్తారో.

ప్రసా—చేస్తారూ, చేస్తేవాళ్ళనిచీల్చి చెండాడెయ్యనూ? సరేనువ్వింత ఆలస్యం చెయ్యటానికి కారణం?

శశి—తమరింత పెండలాడే పడుకోడానికి హేతువు?

ప్రసా—ఏంచేసేడవను మరి. ఏదన్నా చదువుకుందామంటే చల్ల చల్లగా నాదృష్టి చదువుమీాదనుంచి తప్పుకుని మెదడంతా నీరాకకోసం మెస్మరిజం చేస్తూ కూర్చుంది కూర్చుని కూర్చుని కునికిపాట్లు... లేదులే...నువ్వు వస్తున్నావని తెలిసేకళ్ళు మూశాను.

శశి—వలవరింత లన్నీ నన్ను కలవర పెట్టడానికే నన్నమాట.

ప్రసా—లేకపోతే. యింత తెలివితక్కువగా నిద్దట్లో కవిత్వం చెప్పే వాడెవడు?

శశి—సరే నా మనసులో ఉంకే సంగతి ఒకటడుగుతాను చెబుతావు?

ప్రసా—ఒకటికాదు పదడుగు తప్పకుండా చెబుతా.

శశి—(లాలనగా) నువ్వు నన్ను... పెళ్ళి చేసికోడానికి.

ప్రసా—అయ్యో నాయనోయ్ (వెనక్కు తిరుగును)

శశి—ఏం అంతలోనే అలాఅన్నావ్.

ప్రసా—ఆలోచిస్తున్నానుండు (అలోచన) అయితే... కాదు...అల్ రైట్...(త్రుళ్ళిపడి) బాబోయ్...

శశి—బాబో ఏమిటాబాబో...

ప్రసా—శశీ! ఈ సంవత్సరం పరీక్ష ప్యాసయ్యే భ్రాంతి నాకేమీ లేదు. (సంశయంగా) ఈ పనిచేసి......

శశి—ఏపని ?

ప్రసా—అబ్బే ఏపనైనే నంటే. మొత్తంమీద ప్యాసపడమనేది నిల్. ఇక మానాన్నగారు గొడవబెట్టే పెద్దరైస్‌మిల్ (బెంగగా) ఇక యువర్ విల్.

శశి—పెళ్ళికొప్పనివాడవు, నన్ను ఇంతకాలం మురిపించడానికి కారణం ?

ప్రసా—దానికేమిలే. మురుపుకోసం ఆశించావుగనుక.

శశి—ఆమురుపు మరుపురాని కురుపులా హృదయాన్ని బాధిస్తొంటే యేంచెయ్యాలి.

ప్రసా—వెరపనేదే లేకుండా వెంటనే ఆపరేషన్ చెయ్యాలి.

శశి—అవునుగదా. దానికి పనికివచ్చే పరికరం త్యాగమే కదూ.

ప్రసా—నోనో (నవ్వి) భోగం.

శశి—(కోపంగా) నీకుభోగం. అమాయికురాలిని జేసి నన్ను యింతకాలం ఆడించావు యిప్పుడేవిధంగా అంటున్నావు సరే నీకిది న్యాయంగాఉంటే సరే (వెళ్ళబోవును)

ప్రసా—(అడ్డి)అంతకోపమైతే ఎట్లా శశీ,సరదాగా అన్నదానికికూడా అలగటమేనా ! (నెమ్మదిగా శశినికూర్చుండబెట్టి) నాకూ అదే ఉద్దేశముంది. కాని పెద్దవాళ్ళను ఎదిరించి ఆపనిచేయుడమంటే మనభవిష్యత్తు చాలా భయంకరముగా గడుపవలసి వస్తుంది. మనవాళ్ళమీదమనం ఆధారపడడానికా,ఆదాయం చూస్తే నాస్తి. అందుకు కొంతకాలం యిలాగే......

[సుబ్బారాయుడు, మూలయ్య ప్రవేశం]

మూల—చూచారా సుబ్బారాయుడుగారూ ప్రత్యక్షప్రేమనాటకం.

(ప్రసాద్, శశి త్రుళ్ళిపడి లేస్తారు)

సుబ్బా—ఏమేయ్! శశీ! ఏమిటీపని ?

మూల—రహస్య రంగేళీ వ్యాపారమండీ.

సుబ్బా—ఎంతో పెద్దమనిషి వనుకున్నాను. పొరుగూరునుంచి చదువు కనివచ్చి మాయింటి కెదురుగా కాపురంబెట్టి మాయలమరాటీ పని చేస్తునావ్రా.

మూల—అర్ధరాత్రులు యింట్లో ఆడపిల్లలను అమాంతంగామాయం చేస్తున్నాడండీ యీమరాఠీ.

సుబ్బా—మాయంచేయకమరి ? చేస్తాడు అయినా మనబంగారం మంచిదైతే బ్రహ్మంగారిని అడగడ మెందుకు ? మూలయ్య గారూ! దిక్కులేకనీ మరదలు కూతురనీ వెధవముండని ఇంట్లో తెచ్చిపెట్టుకున్నందుకు దీనికి బుద్ధుండాలి గాని...

మూల—బుద్ధి మొద్దుబారి ఇలాంటి పెద్దపనులు ప్రారంభించింది. ఇక నేం.

సుబ్బా—మొద్దుల్లానిలబడ్డారు మాట్లాడ రేమ్రా.

ప్రసా—(ధైర్యంగా) పెద్దలకు బుద్ధంటూ ఉంటే ఈ పిల్ల మాత్రం ఎందుకుచేస్తుందీపని ! మనిషా లేక ఈపిల్ల మానా ? మీావి కళ్ళాలేక గాజుగుళ్ళా కనిపించడంలేదూ వయోప్రాయంలో మీారు వెనక చేసిన చేష్టలు గుర్తులేదూ ? ఉప్పుకారంతిం టూన్న ఈ మానవత్వాన్నుండి మమకారం ఇంకోదారిన పోతోందా. మాటలుచాలించి మర్యాదగా పొండి: ముసలి ముక్కైనా మన మగవాళ్ళకు పెళ్ళిళ్ళు కావాలేం. ఆడదానికి ఆ ప్రమేయమే అక్కరలేదూ, ప్రబుద్ధులు బ్లడీదోగ్స్.

మాల—చివర చివర ఇంగ్లీషుకూడా చిందిందండోయ్. చిటప్, ఏమిటి నువ్వన్నది? మాస్కెల్! మాకు రాదనుకున్నావా?

సుబ్బా—అబ్బాయీ అర్థరహితంగా మాట్లాడకు. పరస్త్రీగమనం పాపహేతువని మనపురాణాలు ఘోషిస్తున్నాయ్, నరకలోకానికి దారెందుకు చూచుకుంటావు? ధర్మంగా నడు.

ప్రసా—(ఆక్షేపణగా) ఓహో! యేమిబోధ! ఓ ఆచార్యదేవా నమోనమః

సుబ్బా—చూస్తుండేకొద్దీ మరీ మీరి పోతున్నావురా అబ్బాయి. అవధానిగారికి తెలిస్తే పరిచి సీలం తు కనుక్కుంటాను. ఒసేవ్ శశీ! నడవ్వేమే? దెయ్యంలా చూస్తా వెందుకు? (చెయ్యి పట్టుకు లాగును.)

శశి—(విషాదంగా) ప్రసాద్.

ప్రసా—(రెండవ చెయ్యి పట్టుకొని) మీరు విడవండి. ఈమె దుష్క్రియ చేస్తున్నప్పుడు మళ్ళీ తీసుకుపోయి ఇంట్లో పెట్టుకోమంటేం సంఘం?

సుబ్బా—ఊఁ, ఇంతకాలం పెంచి నీముఖాన్ని కొట్టమంటా. వెధవకబుర్లు చెప్పకేం వీపు చిట్లుతుంది.

ప్రసా—మీరు నోటితోనే చిట్లిస్తారు; చేష్టలుమాత్రం చేతకాదు. వంటమనిషిని పెడితే తిండిపెట్టుతూకూడా జీతం యివ్వాలి. ఈమె కాజీతం అక్కరలేదనేకదూ కులటంటూనే కూడా తీసుకు వెళ్ళటానికి సిద్ధపడుతున్నారు.

శశి—(ప్రసాద్ వెనుకకు వెళ్ళును.)

సుబ్బా—(కోపంగా) ముద్దా, వాడివెనకాల దాక్కుంటావేమే. ఇకవాడే ఆధారమా నీకు నరే మూలయ్యగారూ మీరిక్కడే ఉండండి. ఈనొంగముండావాడి దొరతన మేమిటో అంతా

నిమిషంలో కనుక్కుంటాను. రిపోర్టుయిచ్చి పోలీసుయినస్పె క్టర్ని తీసుకొస్తాను.

మాల—వెళ్ళిరండి. వీళ్ళని కదలకుండా చేసే బాధ్యత నాది.

(సుబ్బారాయుడు వెళ్ళును)

శశి—(భయంగా) ఏం చేద్దాం ప్రసాద్.

ప్రసా—నీకేం భయంలేదు. నిర్భయంగా ఉండు.

మాల—ఒరేవ్ అబ్బాయీ, ఈలాచూడు. ఏదో చిన్నవయస్సు; కాస్త బుద్ధిగా ఉండకూడదట్రా.

ప్రసా—ఒరే యేమిటా నాలుక మడతపడిందా, నలిపి నారతీస్తాను. కళ్ళు తెరుచుకు మాట్లాడు.

మాల—నీకన్నా పెద్దవాణ్ణి, ఆమాత్రం అనడానికి అధికారం లేదురా అబ్బాయి.

ప్రసా—లేదురా అని చెబుతున్నానురా... పెద్ద...నీపెద్దరికం మా స్టాండెంట్స్ అందరికీ తెలుసు, శాస్త్రిగారి పెద్దమ్మాయి సుబ్బాయమ్మను బలాత్కారం చెయ్యబోయి తన్నులు తిన్నావు. జ్ఞాపకంలేదూ. ఒకసారి శివయ్య జేబులో చిల్లర కానుల ఫర్సు కొట్టెయ్యబోతే నీ వీపు రిపేరీచెయ్యలే? జ్ఞాప కం తెచ్చుకో.

మాల—(ఉద్రిక్తంగా అట్టహాస నటనతో) వెధవ నీకివన్నీ యెవడు చెప్పాడురా, డొక్క చీలికలు చేస్తాను. సన్నిప్పు డేంచేస్తానో చూడు (నడుం బిగించును)

ప్రసా—(ఎదరకు చూచి) అబ్బా చాలామందొచ్చారే. ఏలా పోయేది?

మాల—(వెనక్కుతిరిగి చూస్తాడు. ప్రసాద్ కండువాతో కట్టేస్తాడు)

ప్రసా—(శశితో ప్రక్కకు వెళ్ళి) ఏంచేస్తావురా నువ్వు. ఇందాకేదో డ్యాన్సు చేశావే డామిట్. ఇందులో పసుందు.

(శశి, ప్రసాద్ బైటకుపోదురు)

మూల—బయటికి పోయి గొళ్ళెంకూడా పెట్టావుట్రా, సుబ్బా రాయుడుగారు రానియ్యి చెబుతాను.

(తెర)

## 5వ రంగం

[అబద్ధం ప్రవేశం : పాపయ్యగృహం సావిడి]

అబ—పా...పాపయ్యగారి అల్లుడికి పాపా పాణంమీదకొచ్చింది. సు...సుబ్బారాయుడుగార్కి తలనొప్పి ఎక్కువైంది, మందు కోసమని ఆ...ఆస్పత్రికి వెళ్ళేటప్పటికి అ...అ...అల్లుడు చచ్చిపోతున్నాడు. అ...అమ్మాయిని దీసుకురమ్మని పా... పాపయ్యగారు బతిమాలితే యిలాబయుద్దేరాను. ఆళ్ళతస్సా గొయ్య ము...ముసలోళ్ళకి పెళ్ళిందుకయ్యా? ఆళ్లు పెళ్లాడుతుంటె నా...నా...నాక్కూడా చెమపుడుతోంది. పు... పుట్టినప్పటినుంచి బెమ్మచారి ముండాకొడుకునైపోయాను గదా. నా...నాకేపెళ్ళామేఁటేనా ర...ర...రంభలాగ తయారు జేయకబోదునా, సో...సోకు జేత్తే లోకువగట్టే రకాలుంటాయి. నా పెల్లాం అలా చేయదు. నాకు తెలుసు. ఎదిరిత్తే యీపుచిట్లగొట్టనూ, యేదేఁఅంటే యేమండీ అనాలి అంతే. ఊఁఅంటే ఊచపుచ్చుకుతంతాను. అ... అలా...అ...అనకూడదని దా...దానికి తెలదూ, ఏ...

ఎందుకు తెలుత్తాదేటి కట్టపడి తెచ్చిపెడుతూంటే తెలుత్తాది (స్తంభాన్ని చూస్తూ) ఏమే మాట్లాడవేంటేయ్. అ... అన్నం పెడుదువుగాని లే. అయ్యో సీతల్సిగాగొయ్య మా... మాట్లాడవేంటేఅంటు ఇదిగో సం...సంపేత్తాను నాపొరుసం సీకసలు తెలియదు. (స్తంభాన్నితన్ని వెనక్కు పడి లేచి) సంపేశాను, యె...యెదవని కొ...కొ...కొట్టేశానంటేను, సె...సెప్పినమాట యినకపోతే తన్ననుమరి? (దుఃఖంతో) ఎప్పుడూ కొట్టనోణ్ణికనక నా...నామనసు నీరైపోతోంది. దుఃఖంవత్తోంది, కొట్టను లేయే.

పాంగు

లెమ్మంటె లేవేమె పిల్లమా నువ్వు రమ్మంటె రావేమె పిల్లమా
లోకాననిండీన రాకాశిమూకాలు నీకేసిసూత్తాయి సేదూ
నిప్పులుగక్కుతాయి సూడు అబ్బ నీబాధనే సూసి నిముసముండగలేను ॥లె॥
రంగుకోకలు తెచ్చి బంగారునగలెట్టి శుంగారమేజేత్తానిన్ను
అబ్బ కంగారుపడతారువారూ సంఘపెద్దలంట సూసిసహించలేరు ॥లె॥

[నిర్మల ప్రవేశించి నవ్వును]

అబ—(చూచి సిగ్గుపడి) సరదాగా పాడుకుంటున్నానండి.

నిర్మ—ఏం పనిమీద వచ్చావిక్కడకు ?

అబ—అక్కాబ్బే మిమ్మల్ని పిలవలేదండి.

నిర్మ—అదికాదోయి (సంజ్ఞచేస్తూ) ఏంపనిమీదవచ్చావు ఇక్కడకు అంట.

అబ—అదా (తలగోక్కుంటూ) అ...అసలు ఇక్కడికి ఎ...ఎందుకొచ్చానో (ఆలోచించి) ఆఁ గా...గాఁకక మొదల్చిందండోయ్ ఆ...అప్పట్లో మీ ఆయనగారికి వ...వచ్చే ప్రాణం పో పోయే ప్రాణమున్న, మీ...మీ నాన్నగారు తొందరగా రమ్మన్నారు.

నిర్మ—(కోపంగా) నే రానని చెప్పు.

అబ—ఏమిటీ, న నన్ను ఎళ్లమంటారా !

నిర్మ—(తల పంకించి) అవును.

అబ—బ...బ...బాగా చెప్పారు. (నిష్క్రమించును)

నిర్మ—వచ్చే ప్రాణం పోయే ప్రాణమున్న ఆయనకు. ఆయనో మా నాయనో అర్థం కాదు. ఎంత నిర్బంధానికి గురిఅయినా ఆయన మొగాన్ని ఈజన్మలో చూడలేను చూడను, రాబోయే విచారాన్ని రాపాడించి బాధపడడమెందుకు! భర్త గాని భర్త కష్టంలో ఉంటే భర్తగా నాకు ఎవరు చేశారో ఆ నాన్నగారే దగ్గరఉంటే నాకెందుకీ బాధ. రాట్నం ముందిగా కాలక్షేపానికి.

సాంగు

గిరగిర తిరుగుమ రాట్నమా చరచర తిరుగుమా రాట్నమా
సకలలోక శాంతివె నీకూ సత్యసూత్రమె రాట్నమా
పాటించగదె రాట్నమా పాలించగదె రాట్నమా ॥గి॥
హింసలేని ఆజ్ఞాదేశం యిహలోక సుఖమున కాధారంబై
నిలచేగాదే రాట్నమా పిలచేగాదే రాట్నమా వెలసేగాదే
రాట్నమా ॥గి॥

(పాపయ్య కోపంగా)

పాప—ఏమేయ్ నిర్మలా ! ఎంతకాలమే ఈ మూర్ఖపుపట్టుదల ! మొగుడు హాస్పిటల్లో మంచంఎక్కి చావటానికి సిద్ధంగా ఉంటే రాట్నంతిప్పి దూది వడకి దారాలు తీస్తావటె

నిర్మ—యీకృషికన్నా మంచేముంది నాన్నగారూ !

పాప—నా అమ్మ కదు, బండికూడా వచ్చింది, లే. ఈనాడు నీవిలా పట్టుబడితే రేప్పొద్దున్న నాకు నలుగురిలో నగుబాటుకాదటే.

నిర్మ—నేను పొందే నగుబాటుకన్న మించిన నగుబాటు మరొకటి ఉండదు నాన్నగారూ!

పాప—ఏమిటా సమాధానం ?

నిర్మ—ఏముంది? నన్ను ఒకవస్తువుగా అతనికి కట్టబెట్టి ఆశ జూపి అందవలసిన లబ్ధిని అందేసుగా. ఇంకా అక్కడకు వచ్చి చూస్తే లాభమేమిటి ?

పాప—మెట్టవేదాంతం నీకు గట్టిగా పట్టుబట్టిందేవ్. నేను శాంతంగా ఉన్నంతసేపూ నీ ఆటలు మరీ సాగుతుంటాయి. నేనెంత మాత్రం సాగనిచ్చే వాడిని కాను లేచి హాస్పిటలుకు రా.

నిర్మ—నేను రాలేను నాన్నగారూ. నన్ను క్షమించండి.

పాప—(కోపంగా) రాలేవూ? ఏం ఎందుకురాలేవూ ? కాళ్ళుపడిపోయాయా? కళ్ళుమూసుకుపోయాయా? ఏమొచ్చిందినీకురోగం?

నిర్మ—ఇంతకన్నా ఏదైనా రోగం వస్తేనే మంచిదిగా భావిస్తాను నాన్నగారూ !

పాప—(హేళనగా) పాపం! ఎంతకష్టాల్లో పడిపోయావే! ఎంతబాధ బడిపోతున్నావే! నీ ముఖంమండ, పాపం. అతగాడు నిర్మలా నిర్మలాఅంటూ ఎంతకలవర పడిపోతున్నాడో ఏమైనా తెలుసా. అతను పడేబాధలో నీ బాధ ఎంతటిదే! ఆమాత్రం

జ్ఞానం లేదుటే? భార్యకు భర్తను మించిన దైవం ఎవరన్నా ఉన్నారా? కాస్త ఆలోచించవే నా కడుపు పుడక బెట్టక.

నిర్మ—ఆలోచించాను. నాన్నగారూ! అమాయిక స్థితిలో అతనిచేత మూడుముళ్ళు వేయించినంత మాత్రాన్ని నాకు ఆ ముసలి ఎన్నడూ భర్త కాజాలడని ఇపుడు స్పష్టంగా చెబుతున్నాను. కన్యాకాంక్షతో మీ దగాకు లోనైన ఒక అభాగ్యుడు.

పాప—ఆసి నీయమ్మకడుపు కాల. ఎంతలేసి మాట్లాడుతున్నావే. ఏమిటే నీకీ పొయ్యేకాలం? నిన్ను తవ్వి పాతేస్తాను, నా కోపాన్ని రేపావా, నీ నామరూపాలు లేకుండా చేస్తాను. జాగ్రత్త.

నిర్మ—ఎందుకు నాన్నగారూ అంతకోపం? నన్ను నిర్బంధించి అతనికి చూపించవలసినంత అఘాయిత్యం యిపుడేమంత వచ్చింది? మీరు ఆవృద్ధునకు నన్ను ఎందుకిచ్చి పెళ్ళిచేశారో ఆ కాస్త కోరిక సలక్షణంగా యీడేరిందిగా. ఆస్పిటల్లో పడ్డనాడు అతని ఆస్తిపాస్తులు, అంతక్రితం పెళ్ళినాడు అయిదు వందల రూపాయలు. అన్నీ ముట్టాయిగా. ఇంకా ఎందుకండీ నన్ను బాధించడం?

పాప—ఓహోహో, తొండ ముదిరి ఊసరవిల్లి అయినట్టుగా ఉందే నీ వ్యాపారం! ప్రాధేయపడేకొద్దీ మరీ పైకి లేస్తూఉన్నావే. పళ్ళు రాలగొడ్తాను తెలుసా. కన్నకూతురనే మమకారం కొద్దీ ఊరుకున్నాను. శృతిమించి రాగాన్నిపడింది. (తెరలో బండివాడు) సాయ్యా తొందర్గా రండి. బండి వెళ్ళాలి. బడా పాలస్యం చేశారు.

పాప—వస్తున్నా నాయనా, ఉండరా ఏమేవ్ రావే బండివాడు కూడా కంగారు పడుతున్నాడు.

నిర్మ—నన్నింక అడగడం అనవసరం నాన్నగారూ. నేను రాను. ముహూర్తానికి రాను. ఇది నా నిశ్చయం.

పాప—(పళ్లు కొరుకుతూ) నిశ్చయమా ఓసీ పెంకిఘటన! ఎంతటిదానవయ్యావే నీ కెవడు అడ్డు వస్తాడో నేనూ చూస్తాను. (నిర్మల చెయ్యి పట్టుకొని లాగును) ఆడదాన్ని అణచిపెట్టి ఉంచాలిగాని స్వతంత్రంయిస్తే యిలానే సాగిస్తారు.

నిర్మ—(పెనగులాడుతూ) నన్ను విడవండి, నేను రాను,

అబ—(ఒగరుస్తూ ప్రవేశించి) పా...పాపయ్యగారూ...మీ... మీఅల్లుడు ఆ...ఆస్పిటల్లో చచ్చిపోయ్యారండి.

పాప—(గద్గదికంగా) పోయాడూ, పోయాడ్రా నాయనా.

నిర్మ—(స్తంభించి చూస్తూ ఉండును)

(తెర)

---

## 6 వ రంగం—సత్రపుగది

విషాదంగా శశి

కారు మేఘాలలో మెరుపున్న దనియేరు
మెరుపు తెరిపిలేని మరుపుగల దీలోకం
జాబిల్లి యెంతోను చల్లదన మన్నారు
చల్లదనమూ లేదు నల్లమబ్బేగాని
కోయిల్లా పాటెంతో తీయదనమన్నారు
తీపు కాదది మనసు కోతకత్తే గాని
ప్రేమంటె యానంద ధామమని యన్నారు
కాదు జీవనదగ్ధ స్థానమది నిజమోయి.

ప్రసాద్ ! ఎక్కడికి పరారయ్యావ్ ? ఇదినీకు ధర్మంగాఉందీ. అనాధనని, అబలనని, ఆదరిస్తానని ఆప్యాయంగా ఆహ్వానించి పోషకులనుంచి దూరంచేసి పొరుగూరు తీసుకువచ్చి ఈసత్రములో ప్రవేశపెట్టి రెండురోజులవుండి, నాదృష్టికి దూరమయ్యాడు. ఇట్టి స్థితిలో పొట్టపోషణ కని మరోదారి చూసుకుంటే నాస్థితి దారుణ మౌతుందికదూ. ఇకనుంచి కులటనీ కామపిశాచీ యని కర్కశత్వంగా పిలవడానికి నేనుకాదను. (ఆలోచన) నీచమైన ఆకృషిచేసి నిందను పొందే దానికన్నా నిర్మలంగా యీ తుచ్ఛదేహాన్ని గంగాప్రవాహప్రాప్తిచేయడం సుఖం. (ఎవరకు నడచును)

ప్రసా—[ప్రవేశించి] శశీ !

శశి—(కోపంగా వెనక్కుతిరిగి చూస్తుంది)

ప్రసా—ఎక్కడ కీప్రయాణం ?

శశి—ఎక్కడికా. అక్కడ యిక్కడ అనే నిర్ణయం ఎక్కడలేదో అక్కడికి. ఎక్కడికని ఎవ్వరు ఎప్పుడుప్రశ్నించని ప్రశాంత ప్రదేశానికి, తెలిసిందా ?

ప్రసా—ఏమిటా భావకవిత్వం. ఎందు కా కోపం. మా నాన్నగారిని మాఅమ్మను చూద్దామని ఇంటికి వెళ్ళాను. ఆగమని ఒక్కరోజు ఆపు జేశారు. అంతలో మీ పెత్తండ్రి సుబ్బారాయుడు నోరు నెత్తి మోదుకుంటూవచ్చి నిన్ను తీసుకు చక్కావచ్చినట్టు మా నాన్నగారితో చెప్పాడు. ఇక మా నాన్నగారు నాకు తలవాచేటట్టు చివాట్లుపెట్టి ఆపిల్లని విడచిపెట్టి వచ్చేటట్లయితేనే గుమ్మం ఎక్కమని లేకపోతే యీజన్మలో తనగుమ్మం ఎక్కడానికి వీలులేదని నాముఖం చూడనని పట్టువేసికొన్నాడు. అందుచేత...ఒకరోజు ఆలస్యమైంది.

శశి—ప్రసాద్. ఏమీ తెలియని మీ నాన్నగారిపై నింద మోపడ మెందుకు? అనాలోచితంగా ప్రమగ్గే నాలో భావాన్ని ఉద్రిక్త పరచి ఆనందంగా గడుస్తుందని ఆసలు పెట్టి ఇంటినుంచి తీసుకు వచ్చి ఈ విధంగా నేసా చేయడం?

ప్రసా—ఏం చేశాను? యేదో విధంగా నిన్ను అభివృద్ధికి తీసుకురావాలనే ప్రయత్నం చేస్తున్నాను. కాని మా నాన్నగారా విధంగా శాసించారంటే నా హృదయం యేవిధంగా బాధపడుతుందో గ్రహించు శశీ, నీతో నేనుకూడా ఉంటే మనం గడచి గట్టెక్కే సాధానం ఏముంది చెప్పు?

శశి—అందుకు నీ స్వార్థానికి నా జీవితాన్ని బలిదానం చెయ్యమంటావు, నీనింద్యానికి నేను కారణ భూతురాలను కాకుండా, నా సౌఖ్యసౌధాన్ని భగ్నం చేసికో మంటావు. ఇంతేకదూ నీసలహా, ముక్తిదాయకంగా మురిసిన ముందురోజులు నాదృష్టిలో లేవూ?

ప్రసా—అంత మోసం చేసే వాడనైతే మళ్ళీ ఎందుకొస్తాను. మాటలనే బల్లెపు పోటులతో నా హృదయాన్ని తూట్లుపరచకు. ఆరంభ శూరత్వంతో అర్థరహితపథాన్ని నడిచానంటే అర్థముంది. ఆచరణ అనే అనుభవాన్ని పొందని నా ఆసక్తి నిన్నూ నన్నూకూడా మోసం చేసిందంటే సత్యముంది కాని విధికల్పితానికి నేనేం చేయగలను?

శశి—అనుభవం. అవసరానికి విధి అమర దేవతలా ప్రత్యక్షమౌతాడు.

గీ. మానవుడె విధిన్ సృష్టించు, మాయగాడు
దారిలేనప్పు డావిధి దాపురించు
ప్రసవవేదన వైరాగ్య పథము జూపు
అనెడు మాటలు నీ పట్ల ఘనతగాంచె.

ప్రసా—అనుభవాన్ని బట్టి ఆచరణ సన్నగిలడం అతిశయోక్తిగాదు. ఆధారమంటూ ఉంటే అల్పానికి స్వల్పానికి నే నిల్లా ఆలోచించేవాడినే కాను. ఏదో యీ చదువు సమాప్తమైతే నూ నాన్నగారి చేతిలో ఉన్న ఆస్తి నాపరమే అయితే అప్పుడు నీవు నేను ఆనందంగా ఉంటానికి అడ్డేముంటుంది. అందుకు నేనొక ఆలోచన చెబుతాను. అది నీవు ఆమోదిస్తే నీకు ఆనందం, నాకు ఆధర్మం, యేమంటావ్.

శశి—ఏమిటా ఆ లోచన?

ప్రసా—ఈ ఊళ్ళోనే వితంతూద్వాహం కట్టించడానికి తీవ్రప్రచారం చేస్తున్నాడా మహానుభావు డెవరో.

శశి—ఆ ప్రచారంవల్ల మనకు కలిగే ప్రతిఫల మేమిటి?

ప్రసా—నీజీవితం సుఖప్రదం కావాలంటే ఒక సూక్ష్మమైన సలహా. ఆసంఘంలో నువ్వు జాయి నయితే యిటు సంఘసేవ అటు దేశసేవకూడా చేసిన ట్లుంటుంది ఒక్క ఆఅనుమానాలు అలా గడిపామూ అంటే అనంతరం నిన్ను తప్పక మారేజి చేసుకుంటాను.

శశి—ఆ మాట మాత్రం నిజమని నేనెలా నమ్మను. ఆ ఉద్యమ ప్రచారకుడు కూడా నీలాంటి వాడైతే అప్పుడు నాగతి ఏం కావాలి?

ప్రసా—అలాంటి అనుమానాలకు నీ హృదయంలో స్థానం యివ్వవద్దు. ఆయన పేరేమిటో తెలియదుకాని యిప్పటి కప్పుడే యిద్దరి పెళ్ళిళ్ళు కూడా చేయించాడట. మంచి ధీశాలి. మొన్న మొన్ననే ఉద్యమం ప్రారంభించింది. అప్పుడే ఆంధ్ర దేశమంతా ఆయన చరిత్ర అట్టుడికి పోతోంది. ఆయన వాగ్ధాటి ఎంత చక్కటి దనుకున్నావు? నేను వచ్చే త్రోవ

లోనే మీటింగు జరుగుతోంది. కదలి రాబుద్ధి పుట్టలేదు ఆయన మాటలు వింటూంటే.

శశి—హృదయపూర్వకంగా నా శ్రేయస్సు గురించే నీవు కాంక్షిస్తుంటే నువ్వు చెప్పినట్లు చేయటం నాధర్మంకదు. ఆరు మాసాలలో నీ వన్నట్లుగా చేస్తే అంతకాలం నేను అజ్ఞాతంగా ఉంటాను.

ప్రసా—ఆరుమాసాలవరకు నీవు నాకు అనుజ్ఞయిస్తే తప్పక...... వెళ్ళి ఆయన్ను తీసుకువస్తాను.

శశి—ఆయన దగ్గరకు మనం వెడితే మంచిదేమో!

ప్రసా—పరవాలేదు. ఆయన చాలా నిరాడంబరుడు. ఇక్కడకు అరఫర్లాంగు దూరములోనే ఉన్నది. రహస్యంగా మాట్లాడాలంటే తప్పక నాతో వస్తాడు. అక్కడకు వెళ్ళి పదిమంది ఎదట నీజీవితం నాజీవితం వెల్లడి చేసికోడం అంత మంచిది కాదు.

శశి—వెళ్ళిరా కాని ఆయన దగ్గరకూడా ఆరుమాసాలలో పెళ్ళి చేసుకుంటా నని వాగ్దానం యివ్వాలి సుమా.

ప్రసా—(తల గోక్కుంటూ) ఆయనదగ్గరా (సంశయంగా) సరే—

శశి—అప్పుడే గుఱ్ఱం వెనకడుగు వేస్తోంది.

ప్రసా—అబ్బే తప్పక చెబుతాను. దానికేముంది? ఇప్పుడే వస్తాను. (వెడతాడు)

శశి—ఇల్లు విడచిన స్త్రీ ఎందుకైనా సాహసించడ మనేది సత్యదూరంకాదు. గ్రుడ్డిలో మెల్లలా ఇదొక సుగమనంగానే తోస్తోంది. జీవితాలు మార్పుకు అంకితమయినప్పుడు భావివాంఛ భగ్నపడుతుంది. (ఆలోచనగా) సంతోష వెన్నెట్లో జీవితాన్ని సమున్నతంగా గడపాలనుకున్నాం. కాని సంఘం

పా ం ట

గడచిపోయిన మనమధుర గడియాలన్ని
కలప్రాయమై పోయెరా సఖుడా
కాలములో కలసి పోయెనురా
జాబిల్లి వెలుగులో సంతోష జలధిలో
ఐక్యనావిక నెక్కి యానమూ సేయంగ
మార్యతుపానొచ్చి ముంచివేసెను నౌక
చేతినీ అందీయరా సఖుడా, చేరెవారిని చూపరా.

(తె ర లో మా ట లు)

ఉద—ఆమె పేరు శశీదేవా? ఆ యమ్మా యెక్కడుంది ?

ప్రసా—లోపలి గదిలోవుంది. ముందుగా మనం ఒక నిర్ణయానికి వచ్చిన తర్వాత...

శశి—(ఆత్రంగా) మా అన్నయ్య కంఠధ్వనిలాఉందే. ఇప్పుడేదిదారి (కంగారుగా) ఇలావస్తున్నట్లున్నారే. ప్రక్కగదిలోకిపోతా,

(నిష్క్రమణ)

[ఉదయభాను, ప్రసాదు ప్రవేశం]

ఉద—నా కూడా అలాంటి ఒక అనాథ చెల్లెలుంది ఈమెను ఆమె గానే భావిస్తూ ఆమె బాధాపూరిత జీవితాన్ని మనస్సులో మనన చేస్తున్నాను.

ప్రసా—(ఆశ్చర్యంగా) మీకొక చెల్లెలుందా ? అయితే తమ అసలు పేరు ఏదైనా ఉందా ?

ఉద—ప్రస్తుత పేరు సంస్కర్త, అసలుపేరు యింతవరకు ఎవరితో చెప్పలేదు. అయినా చెప్పేంత అవసరంకూడా లేదు. అయినా, మీతో చెబుతున్నాను, నా పేరు ఉదయభాను.

ప్రసా—(భయంగా) ఉదయభానూ క్షమించండి. ఆమె మీ చెల్లెలు శశి.

ఉద—(ఆశ్చర్యంగా) శశా? నాసోదరి శశా?

శశి—(ఆత్రంగావచ్చి అన్నగారిపాదాలపైపడి దుఃఖంతో) క్షమించు అన్నయ్యా!

ఉద—నీవాతల్లీ. ఎంతద్రోహంచేశావుప్రసాద్, ఈద్రోహం ఈమెకు కాదు. స్త్రీలోకానికి నువ్వుచేసిన ఏచపుపనికి విజ్ఞానికంగా అభివృద్ధైన ఏదేశమయినా అయితే ఎంతశిక్షవిధించేది.

ప్రసా—అలాగా? ఆసంగతి నాకు తెలియదులెండి

ఉద—అమాయిక స్త్రీల శీలాన్ని కళంకితపర్చడంమాత్రం బాగా తెలుసు. అమానుషక్రియలుచేసి అవమానమనేది లేక సంఘంలో శిరస్సెత్తుకుతిరగడం బాగా తెలుసు. కాని భారతీయ యువకుల ప్రథమకర్తవ్యం యేమిటోమాత్రం తెలియదు.

ప్రసా—ప్రథమకర్తవ్య మంటే.

ఉదయ—సంఘసంస్కరణ శాంతిస్థాపన. అంతవరకు మనజాతికి విముక్తి సౌహార్ద్రభావమూ లేదు అట్టిసంఘం.

గీ. ఘోరకల్మష తిమిరింపు గోళమనగ
రక్తదాహమె దానికి యుక్తమనగ
సంచరించెడు సంఘపు చపలగుణము
వంచగను మన మిల నాచరించవలయు.

ప్రసాద్! నీ విధ్యుక్తధర్మాన్ని నెరవేర్చడానికి ముందు నాసోదరికి నీవు చేసిన ద్రోహానికి ప్రతిఫలంగా వివాహం చేసుకోవాలి.

ప్రసా—ఒక్క ఆరుమాసాలు ఆగినట్లయితే యిక నాకభ్యంతరముండదు. లేకపోతే మానాన్నగారూ...

ఉష—ప్రసాద్! ఏమిటా భయం. నీసూక్ష్మదృష్టిని ప్రసరించి స్త్రీ లోకదుస్థితిని పరికించు.

సీ. ఏపాపమెరుగని పాపలకంఠాన
ఉరిబోసి కట్టిన సిరులసొగసు
మగువ మోసికొనెడు మధురపాత్రను తన్న
కుంకుమరాల్చిన కోయతనము
వృద్ధవయస్కుని పెండ్లిపీటలపై తో
ణికిన యిల్లాలి కన్నీటిధార
ప్రకృతిగోన వయస్సు బలియిచ్చి శిశువుతో
మరచి నిద్రించిన మాతృదేవి
కటకటా ఎన్నిజన్మాలా కఠినసంఘ
సర్పకాటునుబడి యిల సమయుచుండె
ఊరకయె చూచుచున్నావ భారతాంబ
ఆర్తరోదన మొకయింత ఆలకించి
లెమ్ము ధీరుడా ధర్మయుద్ధమ్ముకొరకు.

న్యాయమాలోచించి నామాట శిరసావహించు.

ప్రసా—అనుభవంలోకి వస్తేనేగాని ఎవరికీ అర్థం కాదండీ! నామనో గత యాతనలు నాకుటుంబ పరిస్థితులు మీకేం తెలుస్తాయి! యిది తప్పని నేను తెలుసుకున్నాను. ఒప్పుకున్నాను. నాబాధలే మీకున్నట్లయితే వెంటనే పెండ్లి చేసికోమని అనరని నా అభిప్రాయం.

ఉష—నాజీవితాన్ని నువ్వేంపరికించి మాట్లాడుతున్నావు ప్రసాద్!

శా. నాసర్వస్వము ధారవోసి యిల నానా కష్టనిష్ఠూరముల్
మోసీ పాపపు సంఘబంధువుల దురోక్తిహా క్రియాకల్పనా

వేళంబుల్ గని, యేడ్చియేడ్చి నిజమన్వేషించు నేనే వృథా
యాస ప్రాప్తుడనన్నెఱుంగగలవా నా ఆత్మసంక్షోభముల్.

ప్రసా—అయితే మీరుకూడా అగ్నిగుళ్ళవర్షంలోంచి బయట పడ్డారన్నమాట. అంత నిగ్రహాత నాలో ఉందా లేదా అని ఆలోచిస్తున్నాను.

ఉద—నీలాంటి పిరికివాళ్ళనుచూచి స్త్రీలోకం మురిసిపోతుంది. యువకుడవైన నీవు ఈవిధంగా పిరికిబాటను నడుస్తూంటే పెద్దవాళ్ళేమి చేయగలరు? ప్రస్తుత సంఘపథం అవినీతికి అన్యాయాలకు ఆకరమని ఉద్ఘాటిస్తూన్నమనం నూతన సంఘసాధపునాదుల సృష్టిజేసి ఆచరించవలసిన మనం అస్వతంత్రపు వనితాలోకానికి స్వేచ్ఛాసందేశజ్యోతిని అందజేయవలసిన మనం ఈలాంటి అవినీతికార్యాలు రహస్యంగాచేస్తూ బాహ్యానికి నేరనివాడిలా నటించడం లోకాపచారం. ఒక్కసారి ఆశశి దుస్థితిని మనస్సులో మననంచెయ్యి ప్రసాద్.

సీ. లాలించి పోషించి లక్ష్యంబునను బెంచి
పెద్దలేపాడగు పెండ్లి సేయ
మూల్గుచు క్రుక్కుచు ముసలిప్రాణంబులు
పూర్ణంబుగా యమపురికి నేగ
సంఘశాసనమందు సత్వరముగ నామె
విధవను గమ్మించు విందుసేయ
పెద్దలు మూర్ఖులై పెడదారిత్రొక్కిరి
యుద్ధరింతును నేను యుండమంచు
యింతదనుక నామెను నీదుయిష్టమటుల
అనుభవించియు సంఘపుటడుగులోడ
మోసబుచ్చుట ధర్మమా బాసచేసి
ఈ మెస్థితిదలంచి పరిగ్రహింపుమయ్య.

ప్రసా—(పశ్చాత్తాపముతో) మోహావేశంతో చేసిన యీ తప్పిదాన్ని మోమోటం లేకుండా వ్యక్తంచేశాను. సంఘదృష్టిలో నా సభ్యత్వంలో స్వల్పంగా భావించిన యీ కృషి సత్యదృష్టిలో చాలా హేయమైందిగా మీ బోధవల్ల గ్రహించాను కాని నా హృదయం పరిపూర్తిగా పరివర్తన కానిదే ఈ పను చేపట్టనని నిర్ణయాన్ని దాటలేను. ఈ నాటినుంచీ మీ ఉద్యమంలో చేరి సంఘసేవ చేస్తూ టాను. పునఃపరివర్తన ననుసరించి కొద్దిరోజుల్లో పెళ్ళికూడా చేసుకుంటాను. నాకు యింటికి వెళ్ళడం విరక్తిగా తోచింది ఇది మీకిష్టమయితే మీతో రావటానికి సిద్ధంగా ఉన్నాను.

ఉద—(ఆలింగనచేస్తూ) నీజీవితం ధన్యమైంది. నా ఆశయం ఫలించింది. నా ఆనందానికి మేరలేదు. ముగ్గురం కలసి ప్రబోధం చేస్తూ ముందుకు సాగుదాం.

సాంగు

లేలెండోయ్ రారండోయ్
సంఘములోపల పాడురుమీారు ఖండనజేయుగ యువకుల్లారా ॥ లే॥
ముసలివారికే నిసువుల యసువులు
బలిసేయంగా పాడిగాదు
పసలేని యీ దాంపత్యంబిల దేశము నాశము కాకర మోయ్ ॥ లే॥
ప్రేమికులా పెళ్ళిళ్ళే మనకు న్యాయము ధర్మము సత్యంబౌను
ఎన్నడు ఎరుగనివారల పెండ్లి అన్యాయం బధర్మంబోయ్
ఆ ధర్మంబు శూన్యంబోయ్ అరికట్టుటకు లేవండోయ్ అరికట్టుటకు లేవండోయ్ ॥ లే॥

( తెర )

## 7 వ రంగము

పాపయ్యగారియిల్లు డ్రాయరులో పురుషవేషంద్రస్సు
[నిర్మల పాడుకుంటూ]

సాంగు

లేదా యేదారి జగతీ ఘనచీకటిబడిపోతీ
కాఅడవిని నే కాలుపెట్టితే
వెరవుగల్గె చూడగ నేడూ
ఈనాడీయడవిదాటగ దారిలేదా దైవఘటన ॥లే॥

[పాపయ్య ప్రవేశం]

పాప—ఎక్కడికేమి టమ్మాయ్ టింగురంగా అంటూబయల్దేరావు?

నిర్మ—మనస్సేమీబాగుండక యిలా సావిట్లోకి వస్తున్నాను నాన్న గారూ!

పాప—ఇవాళ సావిట్లోకి సావకాశంగా బయల్దేరావు రేపు, విహారంకోసం వీథిలోకి బల్దేరుతావు ఇవేగా నువుచేసే ఘన కార్యాలన్నీ.

నిర్మ—సావిడిలోనికికూడా రాకూడదా నాన్నగారూ!

పాప—సావిట్లోకేగాదు. ఆగదిగుమ్మందాటి కాలు బయట పెట్టడానికే వీలులేదు. అంతగా వెళ్ళాలని ఉంటే దొడ్డిఉందిగా విశాలమైంది. నువ్వు ఈలా వీధిగుమ్మాలలోకి బయలుదేరడం ప్రజలకు అనుమానం. నాకు అవమానం. ఇప్పటికైనా గ్రహించావా?

నిర్మ—నాకీనిర్బంధపు శాసనాలెందుకు నాన్నగారూ! ప్రజంత నన్ను అనుమానస్పదంగా చూడడానికి కారణం.

పాప—(కోపంగా) నీ మొఖం, మొగుడుచచ్చిన ముండవు. ముత్తయిదులా తిరుగుదామని చూస్తున్నావా ఏమిటి? అందుకేనా యిలాంటి చొప్పదంటు ప్రశ్నలు వేస్తున్నావు. ఛీ, లోపలికి పో. జ్ఞానంలేకపోతేసరి. (నిష్క్రమణ)

నిర్మ—మొగుడుచచ్చిన ముండను, ముత్తయిదులా తిరగటానికి చూస్తున్నానట. చూపునకు మరుపనేది ఉంది. ముసలివారికి చావనేది లేకపోతే ఈ సంఘం సంకుచిత కట్టుబాట్లు సజీవంగా ఉంటాయ్. ఏలాంటి కఠోరకర బంధాలు. ఎంతటి కల్మష కటకటాలు. ఈ నీచ సాంప్రదాయాలని పరిమార్చి నిర్మూలించే ప్రముఖులు ఎవ్వరూ ప్రపంచంలో లేరా?

సీ. లేరొకో వృద్ధులు లేవయస్సులబట్టి
బంధింప విడుపింపు ప్రభువు లేర
లేరొకో భువిమీద లేతవయస్కుల
వైధవ్యమును బాపు బుధులు లేర
లేరొకో నేడు పెండ్లిండ్ల స్వాతంత్రంబు
మంచిదేయను మహా మహులు లేర
లేరొకో స్త్రీలనీరీతి నేడ్పింప
కన్నీరుగార్చెడి ఘనులేరు లేర
రెండు సంఘోద్ధరణ కికరెండటంచు
అరచి ఆచరింపగ కడువెరపుచెంది
వీటికి చేయి యింటదూరెడి పెద్దలార
జయపతాకము నెత్తంగ సాగిరండు.

సంఘసంస్కర్తలు సమున్నతసంఘాన్ని సృష్టించి స్త్రీజాతికి దారి జూపడం శీఘ్రకాలంలో జరగదూ.

(తెరలో పోస్ట్‌మెన్)

నిర్మలమ్మగారూ!

నిర్మ—ఎవరు నాయనా.

(తెరలో) పోస్ట్‌మేన్‌నండి. మీకు ఉత్తరం వచ్చింది.

నిర్మ—ఉత్తరమా, నాకాఉత్తరం. నాకా, (లోనికివెళ్ళి ఉత్తరం తెచ్చుకొని కవరుచించి చదువును)

ప్రియమైన నిర్మలకు

శ్రేయోభిలాషి ఉదయభానువ్రాయు విషయ సంపుటి. నీ మూలంగా కొంతవరకు కల్గిన నా పరివర్తనము పవిత్రవంతమై ప్రజ సేవ చేస్తోంది. శశికూడా నా ఉద్యమంలో ఉంటూ నాకు చేయూత నిస్తోంది. బ్రహ్మాండమైన ఉద్యమంద్వారా నూతనసంఘ నిర్మాణానికి కృషి చేస్తున్నాము.

ఇక నీవిషయం నీ ముసలిభర్త హాస్పిటల్లో చనిపోయి నట్లుగాను. నీకు సత్వర విధవాకారం లభించినట్లుగాను విన్నాను.

అర్థంగాని అమానుష విషాదమేఘాలు, నీ యోచనావీధిని మలినపరచి సత్యభానుని పట్టినై నీ విధవాకారానికి కారకులెవరు? నీ పరిమళ ప్రపూర్ణజీవిత ప్రసూనం ముకుళిత మవడానికి హేతు లెవరు? ఏతప్పూ ఎఱుగని నీకీశిక్ష ఎవరువిధించారు? గ్రహించు.

నీ హితాభిలాషి

భాను.

నిర్మ—(ఉత్తరం హృదయాని కద్దుకుంటూ) నాహితాభిలాషి భాను. నా ఆనందమూర్తి భాను. ఎంతకాలానికి నాజీవితం ధన్యమైంది భానూ. ఎంతకాలనికి నీసుందర లేఖనీ మాలిక నాహృదయ చిత్రాని కర్పించి సంతోషముగ్ధురాలిగా చేశావు. (ఆలో

చించి) అవును, అజ్ఞానమేఘాలలో విజ్ఞానభానుడు మధ్య పడ్డాడు. అమాయకురాలినై ఆధర్మతత అనేది మరచిపోయాను. అబలననిస్వశక్తిని శూన్యం చేసుకున్నాను. క్రితమేనిజం గ్రహించాను. ఈనాటినుంచి ఆచరణకు పూనుకుంటూ, ధైర్యంతో నూతన రహదారిలో సాగిపోతాను. నా స్త్రీజాతి ఉన్నతి కోసం నడుం కడతాను, కష్టాలు కలిగినా సంభానుని దర్శించి ఉద్యమంతో కలిసి పనిజేస్తాను. (ముందుకు వెళ్ళబోవును)

[మూలయ్య ముందుగా ప్రవేశం]

మూల—నీప్రయాణానికి నాశకునం ఎక్కడికేను టమ్మాయ్ ప్రయాణం?

నిర్మ—మీరెందు కొచ్చారేమిటి ఇలాగ?

మూల—ఏముంది. నిన్ను పలకరించి పోదామని రాయిలాంటి మనిషి. రంపాన్నికోసినా తెగడుకదా. గుటుక్కుమని చక్కాబోయాడు. నాగుండె గుభేలుమంది అప్పటినుంచీ నాకుతీరికలేకపోయింది...విచారించకమ్మా...ఎందుకు విచారం... యిదంతా ఋణానుబంధం మనంమాత్రం శాశ్వతమా?

నిర్మ—నేనేమీ విచారించడంలేదు. నాకు లేనివిచారం మీకెందుకు మీసానుభూతికి చాలా ఆనందిస్తున్నాను. మీరు వెళ్ళవచ్చును.

మూల—ఎంతలో ఎంతమార్పు ఓహోహో నిజంగా నీవు అమరదేవతవునిర్మలా. ఎంతవైరాగ్యం. ఏలాటి ఆధ్యాత్మికం, నీలాంటివాళ్ళు నూటికీ కోటికీ ఒకరున్నారుగనుక నేప్రపంచం ఇలా నిలచింది...శరీరం మిథ్యఅని బాగా తెలుసుకున్నావ్, ఆచరించి చూపిస్తున్నావ్ మీనాన్నగారు యింట్లోనే ఉన్నారా?

నిర్మ—లేరు, అలా ఎక్కడికో వెళ్ళారు,

మాల—లేరూ, సరేగాని నిర్మలా శరీరం అనేది చూచావు మిథ్య ఈనాడు ఉంటుంది రేపుపోతుంది. కాని ఆత్మఅనేది సత్యం అది నిత్యం పరబ్రహ్మస్వరూపం. దానికి చావులేదు. యిదే భగవద్గీతలోని పరమ రహస్యం. దాన్నే అద్వైతమతమంటారు. దాన్ని ఆచరించి చూపించి ఎక్కువగా ప్రచారం చేసింది శంకరాచార్యులువారు.

నిర్మ—తమరు శుద్ధ అద్వైతమతస్థుల్లా అగుపిస్తున్నారే.

మాల—కాదుమరీ. ఏదోకొంతవరకు సత్యాన్ని గ్రహించాను ఆచరిస్తున్నాను. అంతరంగికంగా ఆ పరమాత్మ దయ ఎప్పటికి కలుగుతుందో.

నిర్మ—కలుగుతుంది తొందర్లోనే కలుగుతుంది.

మాల—నిర్మలా, నాశరీరంఆనందయుతమై పోతుంది ఆత్మ అపారమైనసంతోషసముద్రంలో మునిగి తేలుతుంది. చూడు నిర్మలా శరీరం మిథ్యన్నమాట సత్యమేకదూ. ఏకోనారాయణ నీకూ నాకూ భేదమేది ఎక్కడ శరీరంలోనా మాయశరీరం, నీవేనేను నేనేనీవు (దగ్గరకొస్తూ) మనిద్దరిదీ ఒకటే ఆత్మ (చెయ్యిపట్టుకోబోవును.)

నిర్మ—(తప్పుకొని) మాలయ్యగారూ.

మాల—పిచ్చిపిల్ల! నిజమైన ఆనందం నీకు తెలియదు. ఇలారా

నిర్మ—(చెత్తతీసి కొడుతూ) ఆనందం ఆత్మ.

మాల—కొట్టకేవ్ నిర్మలా. నీతోడు నిన్ను ముట్టుకుంటే ఒట్టు (పారిపోవును)

నిర్మ—పో నీచుడా. పెద్దభక్తునిలావచ్చి పలవరిస్తున్నాడు. ఎంతో నిష్ఠాగరిష్ఠుడట. ఏలాంటిసంఘోద్ధారకుడు! యిలాంటి వాళ్ళని

ఉరితియ్యాలి (ఆలోచించి) సంఘంలో స్త్రీకున్న స్థానాన్ని బట్టి ఒంటి గుండెతో ఒంటరిగా బతుకులు దేరితే పురుష ప్రముఖులెవరైనా కంటితో చూస్తే తంటాయేమో. అందు చేత పురుష వేషంతో బతుద్దేఐతాను సత్య శూన్యమైన సంఘాకారాన్ని బాహ్య పరుస్తాను (మగదుస్తులు ధరిస్తూ)

సాంగు

సంఘమె చూడరా ద్రోహమురా నిజధర్మమే లేదు చూడుమురా॥సం॥
ఆడజాతిని మోసము చేసి అదియె ధర్మము అని యెకవేలా
సదయులు లేర సత్యము చాటా ॥సం॥
సమతలపథము చక్కగ చూచి. సత్యముగల ధర్మమునిలుప
జాలగ లేరా ॥స॥

నిష్క్రమించును,

[ అబద్ధం ప్రవేశం ]

అబ—ఏమండోయ్. పా...పాపయ్యగారు. ఏమండోయ్, ఇంటో లేరేంటి. ఉ...ఉన్నదీ లేందీ చె... చెప్పవేంటయ్యా. ఉన్నదీ లేందీ ఆయనేం చెబుతాడు ఉంటే చెబుతాడుగాని నిర్మలమ్మగారో నిర్మలమ్మగారో...ఏ...ఏమండోయ్ కోపం వత్తుంది. నాకు పలకరేటంటే పలుక బంగారమాయె పాపయ్యగారో మిమ్మల నేనుండీ...పాపాపయ్యగారూ.

పాప—(వెనుకనుంచి ప్రవేశం)

అబ—పా...పాయ్యగారూ !

పాప—ఏమిరా అబద్ధం.

అబ—ఏ పలకరేం టయ్యా లోనుండి ఉన్నదీ లేందీ చెప్పకూడ దేంటి ?

పాప—ఒరేవ్ చెవిటి దద్దమ్మ

అబ—ఓ పాపాత్ములుగారూ

పాప— ఓరి వెధవా (దగ్గరకు వెళతాడు)

అబ—పాపాత్ములుగారూ

పాప—(నెత్తిమీద కొట్టి) వెంకాలనుండి పిలిస్తే వినిపించడం లేదూ?

అబ—అయ్యోరామ యింట్లో లేరంటే ఎందుకుపిలుస్తానండి ఉన్నారని పిలిచాను. లేంని చెప్పగూడదూ మీరు.

పాప—(కళ్ళు పెద్దవి చేసి) లేరని చెప్పాలా నేను,

అబ—మీరు గాకపోతే అమ్మాయిగారూ ఎవరూ చెప్పందే నేనెలా చావనూ అంటే,

పాప—యిప్పుడు నా అవసర మేమిటీ,

అబ—అబ్బే ఎన్నోసార్లు పిలిచేనండి పలకందే.

పాప—ఓరి చెవిటి వెధవ నా అవసరం ఏమిటీ అంట,

అబ—ఆరుకూడా లేరు ఎక్కడకు వెళ్ళారండి?

పాప—గంగలోకి (చేయిసంజ్ఞ చేస్తూ) ఎందుకొచ్చావ్ ?

అబ—అయ్యగారు రమ్మన్నారండి

పాప—(ఎదరకు చూచి) తలుపులన్నీ బార్లాపెట్టి ఎక్కడకు చచ్చింది?
(లోపలకు వెడతాడు)

అబ—అయ్యోపొగర బోత్తసమా సమాధానం యివ్వకుండా వెళ్ళిపోయాడేటీ, అప్పన్నే అల్లుడు చచ్చేడూ ఆయన అత్తి కలిసింది మనసులతో మాట్లాడతాయీ—యన

పాప—(రోదనగా) పోయిందిరా, ఎక్కడికో వెళ్ళిపోయింది. బాబోయి వెతుకుదాం రా రా.

అబ—ఎవడండి. ఆదొంగ ఎంతసామ్ము దొబ్బాడు ఎలాగెల్లాడు .

పాప—దొంగకాపురా నీ మొహం తగలెయ్య. అమ్మాయే వెళ్ళి పోయిందిరా. బాబో నాపరువు ప్రతిష్ఠ నాశనం చేసింది.

అబ—మొ మొత్తం ఎంత రొఖ్ఖం ఉంటుంది.

పాప—(నటనచేస్తూ) అమ్మాయి వెళ్ళిపోయిందిరా.

అబ—అల్లుడుగారి ఆత్తంతా పోయిందీ.

పాప—ఓరివెధవా, నన్ను చంపడానికి వచ్చేవేంరా, నాతోరా.

అబ—నడవండి. దొంగను పట్టుకుందాం.

(నిష్క్రమణ)

( తెర )

---

8 వ రం గం

(సుబ్బారాయుని ఇల్లు, మంచం, కుర్చీలు)

మూల—(ప్రవేశించి) అనుకున్న పనులన్నీ అనాయాసంగా అద్భుతంగా జరిగిపోయాయి. మనకు దక్కవలసిన ధనంకోసం తయారుకావాలి. ఈపనిచేస్తే గౌరవం పోతుందేమోననిఅనుకోవడం అనవసరం. బాకీలు చూస్తే బజారువెంబడి నడవడానికి శక్యమేకాదు. (ఆలోచించి) వేస్తున్నాను ఒకయెత్తు. అయితే హిట్లరు లేకపోతే బట్లరు. క్లోరోఫారం సంపాయించాను. కొడుకు వెళ్ళినప్పటినుంచి అహోరాత్రులు నిద్ర లేక అంబా పెరిగి పైత్యంతలకెక్కి తలపోటు పట్టుకొని తంటాలు పడుతున్నాడు సుబ్బారాయుగారు. తలపోటుమందని ఆశాస్త్ర వాసన చూపించానా మాట్లాడకుండాపడుకుంటాడు. అతని యినుపపెట్టిలో డబ్బు నా పరమౌతుంది. అంతేకన్నా

యేంకావాలి? ఆ కేసు ప్రతిఫలం చెవిటివెధవ అబద్ధం పర వాంతుంది. అంతకన్నా యేంకావాలి?

[సుబ్బారాయుడు తలపట్టుకు మూల్గుతూ ప్రవేశం]

సుబ్బా—(మంచమీద కూర్చుని) ఏం మూలయ్యగారూ ఇలా దయచేశారు?

మూల—(కూర్చుండి) ఏముందండీ, తలపోటుతో బాధపడుతోన్న మిమ్మల్ని చూచి వెడదామని వచ్చాను. ఏమైనా తగ్గినట్టాండి?

సుబ్బా—ఏం తగ్గడం ఏంబాధ. ఏం చెప్పను మూలయ్యగారూ నా గ్రహాస్థితి.

మూల—దానికేంలెండి సుబ్బారాయుగారూ. రోజులన్నీ ఒక్కలాగునే గడుస్తాయా? వస్తూనే ఉంటాయి కష్టాలు, దాటుతూనే ఉండాలి మనం. అదే మానవధర్మం.

సుబ్బా—ఆ వెళ్ళినవెధవ తిరిగొస్తే కాదన్నానా మూలయ్యగారూ! ఏదో తాత్కాలికంగా వచ్చిన కోపానికి అంతపట్టుదల పట్టాలంటూరావాడు?

మూల—ఏమి చెబుతామండీ, యువకరక్తం కదూ. యువకరక్తం.

సుబ్బా—వాడి మొహం రక్తం. నిన్ననే ఒకఉత్తరం ముక్క కూడా వ్రాశాడు.

మూల—ఇంతకూ ఏమని రాశా డేమిటి?

సుబ్బా—ఏదో సంఘాన్ని ఉద్ధరించేస్తున్నాడట. ఒక పెద్ద ఉద్యమాన్ని నడుపు తున్నాడట.

మూల—ఏమిటీ సంఘాన్ని ఉద్ధరించేది? వాళ్ళబొంద. కుక్కగొడుగుల్లా తయారయ్యాయి ఈ ఉద్యమాలన్నీను. నీచ సాంప్రదాయాలు, నీచులూను.

సుబ్బా—ఏమంటావోయి మూలయ్యా? మంచీ చెడ్డా తెలియకుండా మాట్లాడుతున్నారు మావాడు నీచుడా, నీచుడా అంట.

మూల—కాదండి బాబూ, కాదు. ఏదో పొరపాటున ముక్క జారవిడచాను క్షమించండి. మంచిపనే చేస్తున్నాడు మీవాడు మహాదొడ్డ పనికూడా చేస్తూంట.

సుబ్బా—ఏపనైతేం లెండి. వాడెక్కడున్నా సుఖంగా ఉండడం కావాలి నాకు.

మూల—కన్నకొడుకుల్ని కోరేది అంతకన్న ఏముంటుంది లెండి.

సుబ్బా—అబ్బా (అని మూల్గును)

మూల—ఏమిటండీ అంతబాధ పడిపోతున్నారు. యిలాగే ఆరు మాసాలనుంచి మాఆవిడకున్న తలపోటు ఆరునిమిషములలో తగ్గిందంటే నమ్మండి.

సుబ్బా—ఎక్కడిదండీ బాబూ, ఆమందు? నాకేమన్నా లభ్యమౌతుందంటూరా?

మూల—అది గోసాయిచిట్కాయట. ఒకసాధు రహస్యంగా యిచ్చాడు. అంతగా మీకు కావాలనంటే మాయింట్లో క్రితంమోతాదు నిల్వయుంది. ఆమోతాదు వేసుకోండి. గుణం కనుపిస్తే తరువాత తేవొచ్చు.

సుబ్బా—(అబ్బబ్బా) పడలేకుండాఉన్నానండి యీబాధ. నన్ను రక్షించినవారవుతారు. కాస్త తెచ్చిపెడుదురు ఆమందు.

మూల—(లేచి) మరి వెళ్ళి మందు తీసుకువస్తాను. సెలవిప్పించండి.

సుబ్బా—వెళ్ళి తొందరగా తీసుకురండి బాబూ.

[మూలయ్యా వెడుతూండగా అబద్ధం చూడక డీకొంటాడు మూలయ్యా క్రిందబడి లేస్తాడు]

మూల—(కోపంగా) వెధవ రావటం నీవ్వూను, శాస్త్ర కళ్ళు తెరు చుకు రానక్కర లేదట్రా.

అబ—(కోపంగా) ప...ప...పైగా చూడలేదని అగోరిత్తావెందు కయ్యా. జ...జాగ్రత్త. ఎప్పుడూ యీలాంటి పనిచేయక.

మూల—(కోపంగా చూస్తూ) ఆం. (నిష్క్రమణ)

అబ—(సుబ్బారాయుడు దగ్గరికి వెళ్ళి) వణ్ణానికి రమ్మంటుందండీ వంట సుబ్బులు.

సుబ్బా—(కోపంగా) ఛీ నోర్మూయ్యా, యిప్పుడేకదట్రా నేను తిని వచ్చింది. తలపోటు ఎక్కువై నేను యేడుస్తూంటే మళ్ళీ అన్నమూ.

అబ—న...నాకు చెప్పి రె...రెండుగంటలయిందండి. ఇంకా ఆక లెయ్యకపోతే నేనేం చెయ్యను?

సుబ్బా—నీ మొహం మండ రెండుగంటలముందు అన్నమని చెబితే యిప్పుడు చెబుతావట్రా.

అబ—అ...అక్కగికీ చెప్పవన్నానండి. మీ...మీరిల్లా కేకలేత్తా రనే. నాకెందుకులెండి. ఆ...ఆకలేత్తే మీకడుపే కాలు తుంది న...నాకడుపేమైనా కాలుతుందా?

సుబ్బా—(కోపంగా లేచి) డొక్క చీలికలుచేస్తానురా. ఒక్కగాని ఒక్క కొడుకు పుడితే అందరికళ్ళు వాడిమీదే పడ్డాయి. ఏంజేస్తే పాపముందట వెధవల్ని. యింతక్రితం వాడొచ్చి నీచుదని యేడ్చాడూ, యిప్పుడు నువ్వొచ్చి కడుపుకాల అంటున్నావు. వెధవ మాటలు మీరూను. బుద్ధిలేదట్రా మీకసలు.

అబ—(ఏడుస్తూ) పొ...పొరబాటు అన్నానండి. యెప్పుడూ అడ గనులెండి వ...ఏమన్నంమూటే యెత్తనండి.

సుబ్బా—వెధవ శావుతో వేధపడుపున్నాను. ఆ వెళ్ళిన మూలయ్య ఎప్పటికి వస్తాడో యేమో. ఒరేయ్ నువ్వన్నా వెళ్ళి డాక్టరు గారిదగ్గర కాస్త తలపోటు మందు తీసుకురారా. బాధ చాలా యెక్కువగా ఉంది.

అబ—డ...డాక్టరుగారిదగ్గర త...తలపోటు ఎక్కువగా ఉందని డ...డాక్టరుగార్ని తీసుకురమ్మంటారా ?

సుబ్బా—ఓరీ నిన్ను పాతిపెట్ట మందురా మందు.

అబ—ముందు తీసుకురమ్మంటారా ముందు అ...అలాగేనండి. ఎ. ఎల్లి తీసుకువస్తాను. (నిష్క్రమణ)

సుబ్బా—ఆరి చెవిటిపెద్దమ్మ, డాక్టరుగారి నేతీసుకువచ్చేలాగున్నాడే. రానీ వెధవని పనిలోనుంచి లాగిపారేస్తాను: చెవిటిగాడి దంశేను. పరాయివెధవల్ని నమ్ముకుంటే పరిస్థితులు ఇలాగే ఉంటాయి.

[మూలయ్య ప్రవేశం]

మూల—కంగారుపడకండి సుబ్బారాయుడుగారూ ! కర్మ పరిపక్వ మయ్యేరోజు వచ్చింది. పోటుతగ్గి ఘాటుగా నిద్రపడుతుంది. ఇది కొంచెం వాసనచూడండి. తగ్గిపోతుంది తలపోటు.

సుబ్బా—(వాసన చూచును)

మూల—కాస్సేపు కళ్ళుమూసుకోండి. సుఖంగా నిద్రపడుతుంది. తలపోటు తగ్గుతుంది.

సుబ్బా—(కళ్ళుమూసుకు పరుండును)

మూల—ఏమనుకున్నావు ? ధనంయుందు నీకెంత మక్కువో నాకూ అంతేఉంది. ఆలస్యం అమృతం విషం. (మొలకేసి చూస్తూ) అవిగో తాళంచేతులు (తీసి) నేటినుంచి నాజీవితం లక్ష్మీ మయం. (లోనికి వెళ్ళును)

[ముందుగా డాక్టరు వెనక మందులపెట్టెతో అబద్ధం ప్రవేశం]

డాక్ట—(చూచి) వాటిజ్ దిస్ ఏమిటీ సిట్యుయేషను. (పరీక్షిస్తుంటాడు)

అబ—ఏ...ఏమిటండీ డాక్టరుగారూ సుబ్బారాయుడుగారు ఇలా అయిపోయారు (ఏడ్పు) అయ్యో సుబ్బారాయుడుగారో సుబ్బారాయుడుగారూ,

డాక్ట—ఏయ్ సైలెన్స్. మొహం తిరిగి పడిపోయారుగాబోలు! మంచినీళ్ళు తీసుకురా పో.

అబ—ప...పంచి తీసుకురమ్మంటారా.

డాక్ట—పో. బ్రహ్మాండ చెముడు దేవతా.

అబ—తీసుకొత్తానండి (నిష్క్రమణ)

డాక్ట—(పరీక్షించి) ఐ సీ క్లోరోఫారం అపాయ పరిస్థితి. సమయం మించలేదు. (ఇంజెక్షన్ చేసి) ఏ చండాలుడు ఈపనిచేసింది?

[మాలయ్య నడుంపట్టుకొని అబద్ధం ప్రవేశం]

డాక్ట—ఎవ రితను.

అబ—ఈ...ఈడండీ అయ్యగారి యినుపపెట్టె తెడుముతున్నాడండి.

డాక్ట—యస్ హానెస్ట్రోగ్. వీడుచేసినదే ఈ విషప్రయోగం. ఎక్కడికి పోనివ్వకు; అపుచెయ్యి.

మాల—డాక్టరుగారూ నేనేమీ ఎరగనండి బాబూ, మందుసీసా కోసం యింట్లోకి వెళ్ళుమన్నారు. ఇంతలోనే ఈఅఘాయిత్యం ఏర్పడింది. యిదంతా అబద్ధంగాడు చేసినపనే అయి ఉంటుందండి బాబూ,

అబ—యే...యేమి పేలుతున్నాడండి వెధవ. న నాకు యేమీ వినిపించడం లేదు. యి...యినిపిత్తే డొక్క చీలికలు చేసెయ్యనూ.

డాక్ట—మందుసీసాకోసం వెళ్ళినవాడవు యినప్పట్టి తడిమేటంత అవసర మే మొచ్చింది ?

మూల—అదేనండి చెప్పబోయేవిషయం.

సుబ్బా—(కదలి) అమ్మా. (అనును)

డాక్ట—అల్ రైట్. ఇహానేమీ డౌటు లేదు. ఈయనగారు లేచిన తరువాతనైనా నిజంచెప్పకమానడు.

మూల—(పారిపోబోవును)

డాక్ట—(పట్టుకొని) అరే బ్రూట్. ఎక్కడికిరా పోతావు ?

మూల—ఏదో పొరబాటున.........

డాక్ట—అలా దారిలోకిరా ఆల్ రైట్.

మూల—క్లోరోఫారం యిచ్చినమాట వాస్తవం.

డాక్ట—గుడ్. అవస్థలేకుండా నిజంచెప్పావే అబద్ధం స్టేషనుకు తీసుకునడు.

అబ—దూరంగా తీ...తీసికెళ్ళి తన్ని యీడుద్దామనుంటూరా ?

మూల—(త్రుళ్ళిపడి) అయ్యో నాయనో స్టేషనుకే.

డాక్ట—నోర్ముయ్యి. చేవేముందు ఆ ఆలోచన తట్టలేదేం ! ఇది విషప్రయోగంక్రింద చెందుతుంది (తీసుకుపోవుదురు)

సుబ్బా—ఎవరూ, అబ్బఏమిటీవికారం నేను ఎక్కడున్నాను? అసలు జీవించేవున్నానా ? (లేచి) హఠాత్తుగా నేనిలా అయిపోడానికి కారణం...ఎవరువచ్చారు ఎవరువెళ్ళారు. మూలయ్యఏమిటి వాసన చూపించింది మాయముండాకొడుకు, ఏదోమాయ చేశాడు, ఒరేయ్ అబద్ధం అబద్ధమూ అబద్ధమే. వాడు ఎదురుగానే పిలిస్తే వినిపించదు. ఎక్కడికిపోయాడో? ఏమిటీ నా మనస్సు ఆందోళనగా ఉందేం. ఎవరక్రా యింట్లో. ఎవరూ లేరు. ఎవరుంటారు. అందర్నీ నెళ్ళగొట్టాను. చెట్టంత కొడు

కుండి నన్నిలా అవస్థలపాలు చేసిపోయాడు. వాడుపోలేదు. నేనే పొమ్మన్నాను ఎంతసరళ హృదయుడు గాకపోతే ఎంత విశాల భావాలు లేకపోతే నాబిడ్డకు ఉదయభాను, నాఆజ్ఞ ప్రకారం ఆవలకు వెళతాడు? వాడు వుంటానంటేవాడికి అధికారం ఉన్నదంటే నాకునోరెత్తగల హక్కుఉందీ! అది వాడికి తెలీకవెళ్ళేడేమో, తెలీదూ? తెలుసు. అవును నేనీ యింట్లో............ఆవలికి వెడుతున్నాను. నిజంబాబూ నిజం నిజంరా, రా. యిప్పుడురా, నిన్ను హృదయాని కద్దుకుంటాను. యింట్లోంచి పొమ్మనను, నీయిష్టప్రకారం సంచరిస్తాను. నన్ను దిక్కులేని పక్షిలా ఒక్కణ్ణిచేసి ఎక్కడకి పోయావురా వెర్రినాయనా, ఒక్కసారిరావూ, మూర్ఖుడైన మూలయ్య ఉదాస్యభావాన్ని హెచ్చించగల ధనాశవల్ల పెద్దవాడననే అహంకారం నెత్తిమీద నృత్యమాడడంవల్ల నిన్ను కాదన్నాను. కర్కశత్వంగా ఇంటినుండి వెళ్ళగొట్టాను. నాయీపాపానికి క్షమాపనంటూ ఉంటుందా, హే భగవాన్. నాయీదౌర్బల్య హృదయాన్ని దగ్ధపరుచు. నానైతిక శూన్యజీవితాన్ని నాశనం చెయ్యి. ఆశాపిశాచానికి దాసురాలైన నా మోసబుద్ధయిన మంటపాలుచేయి, నన్ను రక్షించు. అక్కడెవరూ, శశీ శశీ రావమ్మా పాపం. నీభావిజీవితాన్ని భగ్నపరచిన పాపిష్టిసంఘం నీహృదయవేదన సమర్థం చేసుకోగలదూ. నేనూ సంఘానికిబంధీనే, నేనేకాదు. ప్రతివారికిహృదయం, పాపపు న్యాయాన్యాయ ధర్మాధర్మ విచక్షణలేని యీపాపిష్టి సంఘానికి బంధువులే. అవేవిటీ, అబ్బఅదిగో, పసిబాలికా ప్రాణసమూహం. ప్రళయనృత్యం చేస్తున్నయ్. పాపిష్టి సంఘానికి బలైనప్రాణాలు.

ఆమధుర మంజుల కంఠారవాలు ప్రళయాంతక భీకరరోదనలుగా మారిపోయినై. ఆమృదు మధుర శరీరశోభ, భయంకరారుణ రుధిర ఛాయలతో పీడగా కనుపిస్తున్నై. అయ్యో నామీదికిరావద్దు. నేనేపాపం చేయలేదు. సంఘశాసనాల వల్ల అలాసంచరించాను. అబ్బవద్దు భయపెట్టవద్దు, భానూ. ఉదయభానూ, రక్షించు నాయనా! అయ్యో! మీదపడుతున్నాయి నీపేరులో ఎంతశక్తి ఉంది భానూ, నీపేరు తలవగానే అవిపారిపోయాయి అడుగో భాను. అడుగో భాను.

[అబద్ధం ప్రవేశం]

సుబ్బా—భానూ. భానూ.

అబ—జైల్లో పెట్టేశారండి.

సుబ్బా—(కౌగలించుకొని) ఎప్పుడువచ్చావు నాయనా మొగమలా శుష్కించిందే ప్రయాణబడలికా.

అబ—(భయంతో) బాబోయి.

సుబ్బా—ఆమాట ఎత్తన్నాయనా కూర్చో.

అబ—బాబో

సుబ్బా—నామాటవిను రా కూర్చో.

అబ—బాబో (పారిపోవును)

సుబ్బా—వెళ్ళిపోతున్నావా ?

(తెర)

9 వ రంగం—వీధి

[ఉదయభాను, శశి, ప్రసాద్, యువకులు]

పాంగు

మహనీయతమా, మంగళప్రదమా, స్త్రీజీవితమే రోతా రోతా
మాతా, భారత దేశా మాతా ॥మ॥

పురుష మోసపు శాసన లేమీ
అబలల విధవా వేషమదేమీ
ధర్మమే లేదా కర్మమె ముసుగా
న్యాయమె లేదా మాతా భారత దేశమాతా.
దేశాదాస్యము వనితా శాప
ధరలో స్వేచ్ఛా జ్యోతీ చూడా
ఆమెకుహక్కే గనశూన్యంబా
ద్రోహంబేయది జగతీమాతా భారత దేశ మాతా ॥మ।

[పాడుకుంటూ సభారంగమునకు ప్రవేశం]

(బహిరంగసభ)

ప్రసా—ఈమహాసభకు సంఘసంస్కర్తలైన శ్రీఉదయభానుగారిని అధ్యక్షులుగా ఉండాలని సభవారంతరితరఫున కోరుతున్నాను.

ఉద—మీరిచ్చిన బాధ్యతను శిరసావహిస్తున్నాను. ముందుగా శ్రీమతి శశి ఆదర్శజ్యోతి శ్రీకందుకూరి వీరేశలింగంగారి ప్రార్థన పాడుతుంది: సావధానంగా వినాలని నాప్రార్థన.

శశి—(సాంగు పాడును)

జై, జై, జై, జై, జాయ్
జై, జై, జై, జై, జాయ్
జై, జై, జై, జై, జాయ్
ప్రవిమల త్యాగీ, జాయ్
విధవా బ్రతుకే శుభంబుగాయ
దీక్షను బూనితి గావా
కందుకూరి వీరేశలింగ, త్రోవనుజూపితివీ వే.
జ్ఞానవిధాతా, ఆంధ్రసుజాతా
ఆశయపూతా, ఆదర్శజ్యోతీ
చనెదా పథమున, గనెదా జయమును
భయమే మనమున లేదుగదా
తెలుగుగడ్డలో వెలసి ప్రజకు
వెలుగు జూపిన కందుకూరి । జై ।

[నిర్మల కరుణకుమార్ వేషముతో వచ్చి కూర్చుండును]

ఉష—సోదర సోదరీ మణులారా!

ఈశుభశోభిత సుసమయాన మీ దర్శనభాగ్యం విజ్ఞాన రాజ్యంలా భావించి రాణించే సంఘనిర్మాణానికి ఉన్నతిని సూచిస్తున్నాను ప్రస్తుతసంఘ లోపాలను బహిర్గత పరుస్తాను. విమర్శించే అధికారం మీది. విజ్ఞానభిక్ష ఆవీరేశలింగంగారిది.

దైవికదృష్టినీ, నిజధర్మ దృష్టిని, పరిశీలిస్తే, పరమన్యాయం. స్త్రీ పురుష సమానప్రతిపత్తి ఒకపురుషునకు ఒకస్త్రీ, ఒకస్త్రీకి ఒకేపురుషుడు, సతీపతిన్యాయం స్వచ్ఛమైనధర్మం. రామాయణ కాలంలో రాజిల్లిన ఆ ధర్మం భారతకాలంలో పరవళ్ళు త్రొక్కింది.

ఆ ధర్మపురుషు లనుకునే అర్జున కృష్ణులకు అనేకమంది భార్యలు. పతివ్రతాలలామతల్లులని నిరూపించిన కుంతి, ద్రౌపది మున్నగు వారలకు పలువురు భర్తలు. ఇవి శాస్త్ర ప్రమాణాలు. పధర్మాన్ని ఆధారంగా తీసుకుంటేనేం. భారతకాలంలో కూడా స్త్రీ జాతిపట్ల యింతపక్షపాతం లేకుండా ఆనాటి సంఘం సంచరించింది. యువతీ యువకుల వివాహ స్వాతంత్ర్యానికి స్వయంవరసూత్రాలు ప్రతిపాదింపబడ్డాయి. కాని రాను రాను ఆశాస్త్రాల్లో మార్పులు కూర్పులు బయలుదేరి అన్నివిధాలా స్త్రీని చేతిబొమ్మలాచేసి విడచారు 'అష్టవర్షే భవేత్ కన్యా' అనే సూత్రాన్ని అజ్ఞానదశలో పశువృత్తిలోఉన్న బాలికనెత్తిపై రుద్దారు. దురదృష్టవశాత్తు ఆమెకు వయోప్రాయం వచ్చేసరికి ఆభర్త విగతుడైతే, ఆ లలన ఆజన్మాంతమూ ప్రాణిలేని ప్రతిమ. ఎంత దురంత సంఘటనలో చూడండి.

స్త్రీకి ఘోషాయే శాశ్వతమని శాసించిన శాస్త్రాలు ఆడది అబల, అస్వతంత్ర అని నిరూపించిన అధర్మాలు విధవకు వివాహ నిషేధం అని నిర్ణయించిన ఆ నీతులు ఎంతవరకు మానవసంఘంలో శ్రేయోభిదాయకంగా పనిచేశాయో పరిశీలిస్తే అను క్షణమూ ఆడ ఆత్మహత్యలకూ, రహస్యపు శిశుహంతకాలకు, వ్యభిచార దుష్కృత్యాలకు దారిచూపినై.

తరతరాలుగా స్త్రీజాతికి చేసిన ఈఅవమానాలు ఈ కఠోర కార్యాలు పరిసమాప్తి చేయమని ప్రబోధించి అనేక కష్టాలుపడి ఆచరించి ఆదర్శజ్యోతిని అందజేసిన ఆ కందుకూరి వీరేశలింగంగారి అడుగు జాడలో నడుస్తూ ఒక ఉద్యమాన్ని నడుపుతున్నాను. ఆ సూత్రాల్ని మీ యెదుట పెడుతున్నాను.

1. యువతీ యువకులకు పెండ్లిండ్ల స్వాతంత్ర్య మివ్వాలి.
2. బాల్యవివాహాలు పరిష్కరించాలి.

3. విధవావివాహాలు చేయించాలి, చేయాలి.
4. వృద్ధుల వివాహాలను రద్దుచేయాలి.
5. ఘోషాపద్ధతి శాశ్వతంగా నశించాలి
6 స్త్రీకి విద్యలో ఆర్థికంలో సమానస్థానం యివ్వాలి. యివే మా ఆశయాలు.

అన్నలారా !

అపారసాగర గంభీరఘోషలాంటి విధవాస్త్రీల ఆర్తనాదం అజ్ఞాతంగా మూగబిడ్డ మన హృదయధర్మ కవాటాలను కదిలించడం లేదూ? మన మహోన్నత మానవాశయ సౌధాకారానికి అవమానం వాటిల్లడంలేదూ? మిత్రులారా !

దేశదేశాలు పరిశీలించినా వీసమెత్తైనా కనుపించని మోసం మనభారతదేశంలో సధర్మంగా పరిగణింప బడుతోందంటే ఎంత అన్యాయం మహిళాలోకానికి కలుగజేస్తున్నామో ఆలోచించండి. అందుచేత ప్రస్తుతం నిలువనీడలేక అల్లాడుతూన్న అనాధులకునివాస మునకై ఒక అనాథశరణాలయం స్థాపిస్తున్నాం. చందాలుగా త్యాగశీలురు అనేకులు సహాయంచేశారు. ఇక అయిదువేలరూపా యలు కొఱత. అనాథశరణాలయం అసంపూర్తిగానిలచి ఆంధ్ర మాత బిడ్డలనుజూస్తూ ధనసహాయంకోసం అశ్రులుచాస్తోంది. అశ్రు బిందువుల నర్పిస్తోంది. ఆలకించి ధనసహాయంచేసి మా శిక్ష్యమాన్ని ప్రోత్సలంచేయ ప్రార్థిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

(సభలో చప్పట్లు)

ఉద —శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగార్కి—
అందరు—జై (అందరు)
కరుణ—(చేయెత్తి) శ్రీ ఉదయభానుగారికి.

అంద—(అందరు) జై (అందరు)

ఉద—నీపేరేమిటి నాయనా.

కరు—కరుణకుమార్, మీఉద్యమం చాలా మంచిదికదండీ.

ఉద—ఆసంగతి నేనెలాచెప్పగలను? మీరు ఊహించండి. ఇప్పటి వరకు మేం మంచిదనే ఆచరిస్తున్నాం.

కరు—మీఉద్యమంలో కలసి పనిచేయాలంటే ఉండవలసిన లక్షణా లేమిటి?

ఉద—భోగభాగ్యాలను నిరసించడం త్యాగజీవితాన్ని అలవర్చుకోవడం.

కరు—అట్టి యువకులలో ఒకణ్ణైన నన్ను మీఉద్యమంలో చేర్చుకోడాని కేమైనా అభ్యంతరముందా?

ఉద—అభ్యంతరం లేదుగాని గత జీవితాన్ని తెలుసుకోవడం మాకు ముఖ్యావసరం

కరు—ఇందరిలో చెప్పదగ్గ విషయాలు కావే అవి.

ఉద—శరణాలయంలోనికి వెళ్ళినతరువాత మాట్లాడదాం.

కరు—మంచిది.

ప్రసా—సంఘురథ ఇనుపచక్రాలలో చిక్కుకొన్న యిదొక క్రొత్త జీవితం కాబోలు!

కరు—బహుశాఃశమ అందరి జీవితాలు యిలాకే ఉంటాయని నా ఉద్దేశం.

శశి—అదికాదండీ. ముందుకువచ్చేవాళ్ళను చూచి వెనుకంజ వేసే వాళ్ళు కొందరున్నారండోయ్.

(ప్రసాద్‌ను చూచి నవ్వును)

ప్రసా—ఆ వెనక్కు వెళ్ళినవాళ్ళే ముందుజ వెయ్యకపోతే ఈ అమ్మాయిగతి ఏమయ్యేదో కనుక్కోండి.

ఉద—సరే కాలహరణమై పోతోంది. ప్రచారం చేసుకుంటూ పోదాంపదండి.

( తెర )

---

## 10 వ రంగం

[సుబ్బారాయుడు మంచం మీద పడుండి మధ్యమధ్య మూల్గుతూ ఉంటాడు. అటు యిటు పాపయ్య డాక్టరు చెరియొక కుర్చీపై కూర్చొని ఉంటారు]

పాప—ఎంతపనిచేసాడండీ డాక్టరుగారూ. ఇంతకూ నాసంసారాన్ని కూడా నష్టేటకలపి నాకూతుర్ని నాకాకుండా చేసింది. ఆ మూలయ్య దుర్మార్గుడే సుమండీ.

డాక్ట—మీఅమ్మాయి ఎక్కడుందోఏమయినా తెలసిందా పాపయ్య గారూ!

పాప—ఏమి తెలియడమండీ తిరగరాని ఊళ్ళుతిరిగాను. వెతకరాని స్థలాలు వెదికాను. ఎక్కడా దాని అజాపజా ఏమీలేదు. ఇంతకీ దానియోగం అలా తగలడ్డదిలెండి. దానికర్మ; మన మేంజేస్తాం.

డాక్ట—అమ్మాయిని విడిచిపెట్టి అలానే కూర్చుంటారన్నమాట.

సుబ్బా—డాక్టరుగారూ! మా పాపయ్యబావగతీ నాగతీ ఒక్కటే అయింది. కన్నకొడుకును కాస్త యింట్లోపని చక్కబెట్టు తున్న పిల్లను యింటినుండి తరిమి వేసినాడనుకున్నాను. యింట్లో

ఉండలేక వెళ్ళిపోయిన కూతురుగురించి ఆయన ఊరు కున్నాడు. ఇంతకూ భగవద్విలాసం కాకపోతే మనవల్ల ఏమవుతుంది?

డాక్ట—ఈఅన్యాయాల కన్నింటికి భగవంతుడే కారకుడయితే మీ రుభయులు ఆదేవుని అంశాసంభూతులన్న మాటేకదు.

పాప—మేమిద్దరమే కాదు, జీవకోటి అంతా పరమాత్మ అంశసంభూతమే. అయినా మన సొంతండి! తృణప్రాయులం గడ్డిపరక కూడా కదపడం మనవల్ల జరగదంటే నమ్మండి డాక్టరు గారూ!

డాక్ట—అయితే నే రావడం, యీ ట్రీట్ మెంటు చెయ్యడం, మీ దృష్టిలో అనవసరం. సరే మానవులకు గడ్డిపరకకూడా కద పడం కష్టతరమైతే ప్రకృతి పరిణామాని కంతటికీ కారణం?

పాప—పరమేశ్వరుడు:

డాక్ట—మానవప్రయత్న మన్నమాట

పాప—శూన్యమేముంది లెండి. చెయ్యడంలో తాను కర్తయినా ప్రతిఫలం యిచ్చే కారకుడు భగవంతుడు. (నవ్వి) అయ్యో డాక్టరుగారూ! పిచ్చిలో పడిపోతున్నారుగాని మనవల్ల ఏమవు తుందంటాను?

డాక్ట—యేమీ కాదంటాను. అయితే మీ ప్రత్యక్షాన పరీక్ష చేదాం (జేబులోనుంచి చిన్న సీసాతీసి) మీరు చిన్న కాగితం మీద ఇలా వ్రాసివ్వండి.

పాప—యేమనండోయ్.

డాక్ట—నన్ను చంపడానికి ఎవరూ కర్తలు కారని, దాన్ని భగ వంతుడే ప్రోత్సల పరచాడని వ్రాసి క్రింద మీ సంతకంపెట్టి ఇలా యివ్వండి.

పాప—(భయంగా) ఎందుకండి బాబూ.

డాక్ట—ఇవి రెండు చుక్కలు మీనోట్లో పోస్తాను. ఇది విషంకాని మిమ్మల్ని యేమీ చెయ్యలేదనుకుంటాను ఆనమ్మకం మీద మీరు నోరు తెరవండి.

పాప—(కంగారుగా లేచి) చచ్చానురా దేవుడా, అంత పనొద్దు డాక్టరుగారూ. అంత భక్తుంటూ నాకుంటే మీ మందు నన్నేం చేయలేదనుకోండి కాని అంతనమ్మకం నాలోఉందా అనేదే.

డాక్ట—అలాయితే మీరు చెప్పిన వేదాంతంపై గట్టినమ్మకం మీకు లేదన్న మాటేకదూ.

పాప—చిత్తం. యేం చెప్పమంటారు? తమ యావజ్జీవము ధారవోసి తపస్సు చేసిన ఋషిపుంగవులే ఆ దేవుని తెలిసికోలేనప్పుడు మనవల్ల యేమవుతుందంటారు డాక్టరుగారూ! మనం ఈ మణ్మాత్రులం కదండీ

డాక్ట—(కోపముగా లేచి) ఈ తల తోకాలేని దంపుడు దైవిక దండకాలను ఆస్తికతలేని ఉపన్యాసాల ద్వారాను అమాయక జీవుల అనేకులను మోసంచేసి ఆర్థికానికి ఆధారం చూచుకుంటూ వారిని అధఃపతితులను చేస్తున్నారు; ఎంతధర్మప్రబుద్ధులండీ మీరు!

సుబ్బా—(లేస్తూ) ఆదేం డాక్టరుగారూ. మాలో ధర్మంలేదూ. మేమేం లోపంచేశాం?

డాక్ట—ఏం లోపంచేశామని అడగటానికి మీకు నోరెలా వొస్తుందండీ! ఖర్మ భగవత్ కల్పిత మనే కపట నాటకంతో కన్నవాళ్ళను యింటినుండి వెళ్ళగొట్టారు. ధనాశా పిశాచానికి దాసులై మానాభిమానాన్ని కూడా మరచి కనుగందులను

ముసలి వాళ్ళకు బలిచేశారు కన్నకొడుకనే అధికారానికి, కట్నమనే ఆశను ముడిపెట్టి వాళ్ళసంసారిక జీవన శోభను, నగ్నంగా భగ్నంజేశారు. ఈ పనులు చేసిన మీ మనస్సు పాపపూరితమై ఆత్మ వేసే క్షోభ పడి ఒక్కసారిగా ఆపంకి లాన్నంతా భగవంతుని శిరస్సునపులిమి తామేమీ నేరస్థులం గామని. బాహ్య ప్రపంచాన్ని భంగపరుస్తున్నారు. ఇలాంటి పాడు సాంప్రదాయాలను వడికట్టు మాటలను మరచి పోవడం చాలామంచిది (వెళ్ళిపోవును)

సుబ్బా—(వెర్రిగాచూస్తూ) నిజం...నిజం...ముమ్మాటికీ నిజం... మీ సుభాషితాలు అమూల్యమైనవి. మీ ఆలోచనలు అమరత్వాన్ని పొందినవి. ధనాశతో సంఘు ధర్మమనే నెపంతో చేయరాని పనులు చేశాం, నీచాతినీచమైన యోచనలు నింపుకొన్నాం. డాక్టర్, డాక్టర్, వెళ్ళిపోయావా నాయనా! ఏలాంటి వెలుగునుచూపి మా సంకుచిత దృష్టికి కాంతిని ప్రసాదించావునాయనా. మావాడు, మా ఉదయభాను హృదయ పూర్వకంగా అభిలషించిన ఆ నిర్మలను ముసలి వానికికట్టబెట్టి ఉభయులను సంక్షోభ పెట్టాను, శశిని కఠినంగా యింటనుంచి అవలకు తోశాను, వాళ్ళ బ్రతుకుల పైన సమ్మెటు దెబ్బలు చరిచాను (పాపయ్యతో) పాపయ్యబావా! నువ్వు చేసిన పాడుపని నీలో ఉండి నిద్రపట్టనిస్తోందా ?

పాప—(భయంగా చూస్తూ) లేదు.

సుబ్బా—ఇవన్నీ భగవత్సంకల్పాలే అయితే మన మనస్సుకీ అశాంతి ఎందుకు బావా !

పాప—ఇవన్నీ మనం చేసిన పాడుపనులేమో ?

సుబ్బా—ఏమో కాదు, నిజం కూడాను, నా ఉదయభానుని చూడాలి.

పాప— ఈ నీరస స్థితిలో నేనా.

సుబ్బా—కల్యాలతో నైనా పోయి వాడిని చూడాలి. అంతవరకూ నాకు సుఖంలేదు.

(అబద్ధం నవ్వుతూ ప్రవేశం)

పాప—ఎందుకురా ఆనవ్వు? నవ్వి నన్ను చంపకురా నాయనా, అదేదో కాస్త చెబుదూ.

అబ—(నవ్వుఆపుకొని) మనరేనండి మూలయ్యగాడికి ఒకటి, రెండు, మూడేళ్లు ఖైదేశారండి.

సుబ్బా—మానొడ్డపని జరిగిందిరా నాయనా. ఆచేతిలో కాగితా లేమిటి?

అబ—రోగోడ్రే వెడుతున్నానండి, పోష్టుబంట్రోతు ఉత్తర మిచ్చాడండి.

సుబ్బా—(తీసికొని) పాపయ్యబావా, ఇదేదో శాస్త్ర చదివి వినిపించు నాయనా.

పాప—(అందుకుని, ఉత్తరంచూచి) ఉదయభాను దగ్గర్నుంచే

సుబ్బా—(సంతోషంతో) అబ్బాయి దగ్గర్నుంచే? ఉదయభాను దగ్గర్నుంచే. ఏమిటో చదువుబావా తొందరగా చదువు.

పాప—ఉండవోయి బావా. కంగారేమిటి చదువుతా సరిగ్గావిను. (చదువును) నాన్నగార్కి నమస్కారములు.

నన్ను మీరు ఇంటినుండి సాగనంపడం సంఘసేవకు ప్రోత్స హించి పంపినట్లుగా భావిస్తున్నాను. నేను చేసిన కృషిఫలితంగా ఒక అనాథ శరణాలయాన్ని స్థాపించాను. వచ్చేఆదివారం గృహప్రవేశం పుత్రవాత్సల్యం అంతరంగికంగా యేమాత్ర మున్నా ఈశుభసమ యాన్ని వీక్షించగలరని నమ్ముచున్నాను.

విలాసం: విజ్ఞానపురం
సంస్కరణవీధి

ఇట్లు మీబిడ్డను
ఉదయభాను,

సుబ్బా—(ఉత్తరం అందుకొని వెర్రిగాచూస్తూ) నాబిడ్డడు ఉదయభానుడు సంఘసేవకుడు. ఆగౌరవం నాది. నేపొందే ఆనందానికి అంతుంటుందీ (ఉత్తరం గుండెలకద్దుకొని) పాపయ్యబావా. ఇక ఆదివారం ఎన్నిరోజులుంది?

అబ—(భయంగా) గు...గుండెల్లో నొప్పిచ్చిందండి

పాప—ఆదివారం ఏదీనాలుగురోజులేగా ఉంది

సుబ్బా—అయితే నువ్వుకూడా ప్రయాణంకావాలి బావా, ఒరేయ్ అబద్ధం ఇలాచూడు.

అబ—డా...డాక్టరుగార్ని తీసుకురమ్మంటారా ?

పాప—ఓరీ నీబుద్ధి పాడుగాను, అంతబ్రహ్మచెముడేమిట్రా ?

సుబ్బా—వాణ్ణి ఏమనకు బావా, వాడిచెవుడే నాప్రాణాన్ని కాపాడింది. వాడిచాకచక్యమే మూలయ్యను పట్టించింది. నౌకరీకి తగ్గ ఉపకారానికి మించి వీడుచేయగలిగాడు.

అబ—యేమంటున్నారండి? ఆ...కాగితం యేటండి ?

సుబ్బా—(సంజ్ఞ చేస్తూ) అబ్బాయి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చిందిరా.

అబ—అబ్బాయిగారి పెళ్ళిరేకాండి ?

సుబ్బా—నీనోటివాచా అలాజరగాలిరా.

అబ—పెళ్ళికూతురెవరండి !

పాప—(లేచి) నీమొగం నీమొగమున్నూ. అలాఇంటికి వెళ్ళొస్తాను బావా.

సుబ్బా—వెళ్ళేవాడవు ఎల్లాగూ వెళుతున్నావు మనం ఆదివారం ఉదయానికల్లా అక్కడకు వస్తున్నట్లుగా చిన్నటెలిగ్రాం యియ్యి. ఎంతవుతుందో అంతాస్తాను.

పాప—ఏమిటి బావోయ్, ఎప్పుడూలేని తెగింపు.

సుబ్బా—అబ్బాయిని చూడాలని ఆరాటం.

పాప—ఎలాగైనా కన్నకొడుపు. వెళ్ళొస్తా. (వెళ్ళిపోవును)

సుబ్బా—ఒరేయ్ అబద్ధం! అబ్బాయిదగ్గరకు వెళ్ళి ఇంటికితిరిగి వచ్చే వరకు నిర్మలంగా ఉండాలి సుమా.

అబ—పెళ్ళికూతురు; నిర్మలమ్మ గారేనండి?

సుబ్బా—అది కాదురా.

అబ—ఏదైతేలెండి పెళ్ళికావడమే కావాలిగాని నూ ఉదయభాను గారికి పెళ్ళోయ్ పెళ్ళి.

(చంక లెగరేస్తూ వెళ్ళును)

సుబ్బా—అభిమానం వెధవకి (నిష్క్ర-)

(తెర)

---

## 11 వ రంగం

నిర్మ—(కరుణకు మార్ వేమంతో)

సాంగు

జీవితమాహా, జీవితమాహా, జీవితమాహా
నేటికి పూజ్యంబాయె ॥జీ॥
ప్రియుదర్శనమె. శుభశోభితమూ నేటికి పూజ్యంబాయె
స్వేచ్ఛయె గాయిలమగు నీప్రపంచము స్వేచ్ఛయెజీవనశోభ
బ్రతుకు మధురమాయె నానటన చోద్యమాయె ॥జీ॥

[ఉదయభాను ప్రవేశం]

కరుణ—(తత్తరపాటుగా) నమస్తే ఉదయభానుగారూ.

ఉద—(కూర్చుంటూ) నమస్తే.

కరుణ—రేపు నూతన శరణాలయ ప్రవేశం నిజమేనా?

ఉద—మీకా సందేహం ఎందుకు కలగాలి?

కరుణ—కాదులెండి. రేపు నేను ప్రేమించిన అమ్మాయి వస్తుం దేమోనని.

ఉష—వస్తే ?

కరుణ—అదే శుభ సమయంలో మాకుకూడా పెళ్ళి.

ఉష—చేసేస్తే బాగుంటుందనా మీ ఉద్దేశ:?

కరు—అవునండి.

ఉష—పరిపూర్తిగా గతజీవితాన్ని చెప్పనిదే మేమాపని ఎలా చేయగలం ?

కరు—అది చెప్పడానికే నేనూ చూస్తున్నాను

ఉష—అది తెలిసికోడానికే నేనుకూడా వచ్చింది.

కరు—అయితే వినండి.

ఉష—అయితే చెప్పండి.

కరు—మా మేనమామ కూతురు అపురూపసుందరి. ఆమెను ప్రేమించాను.

ఉష—మంచిపనిచేశారు. ఇంతకూ ఆ అమ్మాయి మిమ్మల్ని ప్రేమించిందోలేదో తెలుసుకున్నారా ?

కరు—తెలిసికోలేకపోవడమేమిటి పెళ్ళికూడా చేసికొందామని నిర్ణయించుకున్నాం.

ఉష—దానికింత దూరంరావడమెందుకు ?

కరు—అచ్చ ఆవిషయమేకదండి చెబుతున్నాను.

ఉష—దయయుంచి మీరు తొందరగా చెపితే యింకా నాకు చాల పనులున్నాయి అవిచూచుకుంటాను.

కరు—అయితే వినండి. అలా పెళ్ళిచేసుకుందామని అనుకున్నాం. తీరా నేను చదువుకొనడానికి ఊరువెళ్ళవలసి వచ్చింది.

ఉష— ఊఁ, తరువాత.

కరు—ఎందుకండీ. చెబుదామని అనుకుంటూంటే హృదయము మూగబాధతో మూల్గుతుంది.

ఉద—అయితే మానివెయ్యండి.

కరు—అబ్బే చెబుతానండి.

ఉద—ఊఁ చెప్పండి.

కరు—నేను సెలవులలో ఇంటికి వచ్చేసరికి ఆ అమ్మాయికి పెళ్ళయి పోయింది.

ఉద—అయితే గొడవ లేదుగదా.

కరు—గొడవ కాదండీ పెళ్ళిచేసుకున్నవాడు పండు వృద్ధు. ఆరు మాసాలు గడువందే ఆలోకము చేరుకున్నాడు. ఇక నా ప్రేయసి పడేబాధ చెప్పడానికి శక్యమే కాదు. అహోరాత్రులు ధారపాతముగా ఏడుస్తుంది.

ఉద—పాపం ముసలిమగణ్ణి గురించేనా?

కరు—కాదండీ తనజీవితము అధఃపతితం అవడంగురించి.

ఉ. కాలములోనె నావయసు కాలముదీరిన వృద్ధురాలుగా
సోలెనుజీవనాసుమము శోకముగాక మరేమిగల్గు రమే
పూలును యాకులున్ చిగురుపుట్టుక లేనిది మోడుగాన యీ
నేలకు భారమానటుల నీచపుజీవితమేల నమ్మెనో...

ఉద—అది అర్థరహితమైన ఆలోచన. ఆవిధవ ఆకార కారకు లెవరో గ్రహిస్తే ఆమె దుఃఖం కొంతవరకు ఉపశాంతి పొంద గలదు. మనము సంఘమునూర్పును కోరాలితప్ప ఏడుపుతో ఇంట్లో కూర్చొనినంతమాత్రాన ఫలితంలేదు.

కరు—మగవాళ్ళంగాబట్టి మనకా తెగింపు ఉంటుంది. ఆడవాళ్ళకు ఆమాత్రం ధైర్యం ఏలాచిక్కుతుందండీ.

ఉద—ఆబాధ్యత మీపైనఉంది ఆమె అజ్ఞాన తిమిరాన్ని ఆవలకు నెట్టడంకోసం ఆమె వివేకితనాన్ని పారద్రోలడంకోసం మీరు తీవ్రకృషి చెయ్యాలి,

కరు—కృషి చేసినప్పటికి ఆమె సంఘానికి జంకుతూఉంటే.

ఉద—మీమీద ఆమెకు ప్రేమ లేదన్నమాట.

కరు—ప్రేముండికూడా ధైర్యం చేయలేనివారు లేరు?

ఉద—ఆమాట నేను విశ్వసించను. ప్రేమకు త్యాగానికి సన్నిహిత సంబంధం ఉంది. ప్రేమ ఉజ్వలితమైనప్పుడు త్యాగతరంగాలు వాటంతటవే శాసనకట్టలను ఛేదిస్తాయి. ఇది ముమ్మాటికినిజం.

కరు—(మొగాన్ని ఎగాదిగాచూస్తూ) అబ్బా మీరు చాలా అఖండులండీ.

ఉద—మీపొగడ్త నాశించి ప్రస్తుతం మీదగ్గర నేనేమీ ప్రదర్శించడానికి రాలేదు.

కరు—అన్నిటికి అన్ని సమాధానాలు మీరు చెబుతూంటే నేనేలా చెప్పనండి?

ఉద—మీ చెప్పడానికి నేనేమీ అడ్డురాలేదుగదా. అడిగినదానికి మాత్రము సమాధానం చెబుతాను. మీ ప్రియురాలికి ధైర్యంలేకపోతే మీరు పెళ్ళి ఏలా చేసుకుంటారండీ?

కరు—ఆమెకు ధైర్యం ఉందండీ రేపు ఉదయానికల్లా మన శరణాలయం దగ్గరకే వచ్చేస్తుంది.

ఉద—ఆమాటనిజమేనా. కరుణాకుమార్.

కరు—ముమ్మాటికీ నిజం.

ఉద—అయితే మీఇద్దరికి ఆనందముగా పెళ్ళిచేస్తాను. మా ఉద్యమములో చేర్చుకుంటాను.

కరు—మీక్కూడా ఇలాంటిపెళ్ళిజరిగితే నేనుకూడాచాలాఆనందిస్తాను.

ఉద—అది అప్రస్తుతం నేను వెళ్ళివస్తాను. (వెళ్ళబోవును)

కరు—మీరుకూడా ఇలాగే ఒక అమ్మాయిని ప్రేమించారని నా అనుమానం.

ఉద—(తిరిగివచ్చి) అని మీరనుకుంటున్నారా ఎవరైనా చెప్పారా?

కరు—అది అప్రస్తుతం మీదారినిమీరు వెళ్ళండి.
ఉద—ఆ అవును నేను కాదన లేను. కానిఆ అదృష్టంనాకులభ్యంకాదు.
కరు— ఏం ఎందుచేత ?
ఉద—అది నేను చెప్పలేను.
కరు—ఆ అమ్మాయివస్తే మీరు పెండ్లి చేసుకుంటారా ?
ఉద—అది ఆ అమ్మాయి ఇష్టంతో కూడుకొన్నపని.
కరు—ఈమాటలవల్ల మీహృదయానికి కష్టంకలిగితే క్షమించండి.
ఉద—స్పష్టపడందానికి కష్టాలు నష్టాలు లెక్కించుకోడం కల ప్రాయం అయినా తమ మాటలధోరణిచూస్తే నాకు అను మానంగా తోస్తుంది...మీరు...నిజంగా పురుషులేనా...
కరు—పురుషుణ్ణి స్త్రీలుభావించే మనోపరిస్థితిగల (వెళ్ళును)
ఉద—మాటలధోరణిచూస్తే మహిళామనోహరకంఠధ్వని, చేష్టలు చూస్తే పురుషులపోకడ, ఏదోమరచినవస్తువు హృదయానికి తాకినట్లు స్మృతిపథంలో మెరుస్తుంది...నిర్మలకాదుగదా ఒక వేళ నిర్మలైతే...తానెందుకు వచ్చిందో తెలియజేయవలసిన బాధ్యత ఆమెపైనే ఉందిగా, నాకీఆత్రమెందుకు ? (వెళ్ళును)
కరు—(ఉద్రిక్తంగావచ్చి) భానూ, భానూ, ఎంతఅమాయకుడవు !

సాంగు

సలలితపదగమనా త్యాగమయాకారా
భానూ, భవ్యజీవితమాయీ నీదే ॥భ॥
అనవరతంబును హృదయమోహాయిగ
ముదమొందెను నీ దర్శనంబుగల
నీవేనాకిల నాథుడవోయీ నీవేజీవనసారథివోయీ
నీవేజ్యోతివి నేనేకాంతిని
ఈకంటక బాటకల్పనమని కారుచీకటికి వెలుగునుజూపగ
న్యాయగతిని బోధచేయుదామా ॥స॥

ఇలత్యాగ గమనమే ఘనజీవనపథమూ
సంఘమునందున సమరము జేసియు
శాంతిమయము జేయగనే మనమిల
కలసిసేదామా, సేవాకలసిసేదామా భానూ కలసిసేదామా॥సల॥

(నిష్క్రమణ)

(తెర)

---

## 12వ రంగం

### శరణాలయం

[వీరేశలింగంగారిఫొటోకు కొందరు పూలమాలలు గుచ్చుతుందురు. తోరణములు కొందరు గుచ్చుతుందురు]

సాంగు

సేయరా సేవనూ సంఘసేవనూ చేసిచూపరా ॥సే॥

కరు—మాయమబ్బులూ బాయగవేగా
భానుదేవుడూ దర్శనమిచ్చే

అంద—సేయనా సేవనూ సంఘసేవనూ చేసిచూపరా ॥సే॥

శశి—దళములూకదలే సుమములుమెదలే
స్వేచ్ఛవాయువు హాయిగవీచే

అంద—సేయరా సేవనూ సంఘసేవనూ చేసిచూపరా ॥సే॥

ఉద—కరుణకుమార్, ఈచిత్రానికి ఏమని నామకరణం చేద్దాం?

కరు—(ఆలోచించి) నాకేమీ తట్టడంలేదు ఆపేరుకూడా మీరు పెడితేనే బాగుంటుంది.

ఉద—అది మీరుచెప్పనక్కర్లేదు, ఏంప్రసాద్ నీవుద్దేశం?

ప్రసా—బావగారికి నాభావం చెప్పడం భయంగా ఉంది. అయినా చెబుతున్నాను. విధవావివాహముల విరాట్ అని.

ఉద—అబ్బే బాగుండలేదు చెల్లాయి శశీ! నీవు చెప్పమ్మా.

శశి—సం దేశకిగణింపంక్తితో ఆదర్శమైన కాంతిజూపిన ఆ కందుకూరికి జ్యోతిఅనే నామాన్ని పెడితే బాగుంటుందని నాఅభిప్రాయం

ఉద—బాగుంది. కాని జ్యోతికి ముందు క్రియాహాసాన్ని పొందగల మరోచిన్నపదాన్ని మేళవిస్తే సహజముగా ఉంటుంది.

ప్రసా—అన్నకి చెల్లెకి మాటనచ్చకపోతే మీమాట నామాట నచ్చుతుందా ?

కరు—నే అనబోయే మాట మీరే అనినందుకు నాఅభివందనములు.

ఉద—పక్షపాతానికి దీనిలో స్థానంలేదు.

సీ. అన్యాయసంఘంబు ఆదర్శశూన్యంబు
అంచు పోరినయట్టి కంచుగంట
మగడుపోయినబాల మరుపెండ్లితప్పన్న
కాదంచుపోరిన కాంతిగుళిక
బాధించివిధవల బలిసేయువారల
అడ్డుబాపినయట్టి అగ్నికణము
వృద్ధులపెండ్లను వృక్షశాఖలనెల్ల
మొదలంటనరికిన పదునుకత్తి
అట్టి ధీరమతీజాతి అమరజ్యోతి
కందుకూరి వీరేశలింగమ్ము ఆంధ్ర
మాత ముద్దుబిడ్డండైన మాన్యుడరయ
ధైర్యశాలి యాధీరుడా ధర్మజ్యోతి.

అందుకే ఆదర్శజ్యోతి అనే నామాన్ని స్థిరంజేశాను. (కరుణకుమార్ తో) ఆ మరచాను. వేళవుతోంది. మీ ప్రియురాలు ఇంకా రాలేదేమండి?

కరు—అదే నేనూ, ఆలోచిస్తూన్నానండి. బహుశ వస్తే రావచ్చును.
ఉద—అనుమానంగా మాట్లాడుతోన్న మీమాటల్లో అర్థం?
శశి—అపనమ్మకం.
కరు—రావడం నిజమే కాని విధవను పెళ్లాడడం సమంజసం కాదే మోనని ఆలోచిస్తున్నాను.
శశి—ప్రసాద్‌కు సరిసమాన చేయి ఈ నాటికి లభించారు.
ఉద—మీపేరు కరుణఅనే పదం మార్పుచేసి పిరికి అని పెడితే బావుంటుంది.
ప్రసాద్—అంటే పిరికి కుమార్ అన్నమాట.
కరు—పేర్లు ప్రతివారూ పెట్టవచ్చును. పెళ్ళిదగ్గర మాత్రం పెడ ముఖం.
ఉద—వ్యంగ్యంగాక విపులీకరించి చెప్పడం చాలా మంచిది.
కరు—అలాయితే వినండి. ప్రేమించిన అమ్మాయేవస్తే నిర్భయంగా మీారు పెండ్లిచేసికోగలరా?
ఉద—ఈ ఉద్యమము అంతా నటననా నీ ఉద్దేశం. ఆమె కిష్ట మయితే తప్పని సరిగా అందుకు సిద్ధుడ నవుతాను.
కరు—అలాయితే ఆమె ఇప్పుడే హాజరవుతుంది.
ఉద—ఎక్కడనుంచి.
కరు—ఇక్కడనుంచే.
ఉద—ఏదీ.
కరు—(తలపాగాతీస్తూ) ఇదిగో మగవేషంలో. మిమ్మన్ని మాయం చేసిన నిర్మల.
ఉద—(ఆశ్చర్యంతో) నిర్మలా!
నిర్మ—అవును ఉదయభాను.
ప్రసా—అన్నప్రకారం పెళ్ళిచేసికోవడమే మీా ప్రతిజ్ఞా పాలనకు ఉదాహరణ.

శశి—అన్నయ్యకు నిర్మలకు ఈనాడే పెళ్ళి [పాపయ్య ప్రవేశం]

పాప—అలాంటిపనీ ఒక్కనాటికిగూడా జరగనివ్వను, ఏమేవ్ నిర్మలా, నువ్వు ఇల్లువిడచి బయటుదేరినది యిందుకేనటే.

సుబ్బా—(లోపలనుంచివస్తూ) భానూ భానూ.

ఉద—(ఆనందంగా) నాన్నా, నాన్నా, ఇదేనా రాక? (కౌగలించుకొనును)

సుబ్బా—అవును బాబూ.

ఉద—నాకానందమైంది నాన్నగారూ.

సుబ్బా—(విచారంగా) నీయొక్క మంచిఆలోచనను గ్రహించలేక ఆ మూలయ్యమాటలవల్ల నిన్ను యింట్లోంచి వెళ్ళగొట్టాను

ఉద—మా ఉభయుల జీవితాన్ని పునీతం చేయడానికి ప్రోత్సహించి పంపించినట్లుగా భావిస్తున్నాను. మీరేం బాధపడవద్దు నాన్నగారూ

ప్రసా—పాపయ్యగారూ, ఈ పెళ్ళినిచేయడానికి వీలులేదనడంలో మీతాలూకు అభిప్రాయం?

పాప—చాల్లేవయ్యా. చెప్పొచ్చావు. ఇళ్ళల్లోఉన్న పిల్లలను వీధుల్లోకిలాగే ప్రముఖుడవు, (నిర్మలతో) అమ్మాయి నకు నా పరువు ప్రతిష్టలను మంటగలపడానికి పుట్టావు నడవ్వేం.

నిర్మ—ఎందుకు నాన్నగారూ ఆ ఆగ్రహం.

ప్రసా—నిర్మలను దౌర్జన్యంగా ఇంటికి తీసుకువెళ్ళడానికి మీకెక్కడుండండీ ఆ అధికారం

పాప—ఎంతగొప్ప ప్రశ్న వేశావు. ఆమె నాకూతురు భర్తృవిహీనురాలు, బాధ్యత తండ్రిది. ఆధర్మప్రకారం తీసుకువెళ్ళడానికి నాకధికారముంది.

నిర్మ—నాన్న వధర్మాని అధారంగా తీసుకొని నన్ను వృద్ధునకిచ్చి పెళ్ళి చేశారో, ఆ ధర్మాన్నే ఇప్పుడు ఈపెండ్లి కూడదంటు

న్నారు. ఏమి ధర్మమండీ, మీధర్మాలను దారనేదేఉంటే; మీశాస్త్రదాస్యానికి దారనేదేఉంటే మీహృదయాలకు పరివర్తన అంటూఉండేది, ఏధర్మ శాస్త్రాన్ని మీరు ఆధారంగా తీసికొని నన్ను యింకా అదుపాజ్ఞల్లో ఉంచాలని ప్రయత్నం చేస్తున్నారో ఆధర్మశాస్త్రాలే ఆడపిల్లకు పెండ్లిఅయ్యే పర్యంతమే తలితండ్రులు ఆధారమనీ, అనంతరం భర్తనీ ఆపైన సుతులనీ నిర్ణయించినాయి. అంటే నాకు ఎప్పుడు పెళ్ళి చేశారో ఆనాడు నాపైనుండే అధికారం అంతమైంది. ఇక నాఆధారులుకూడా అంతమైనారు. ఇప్పుడు నాకాధారం ఆత్మబుద్ధే. ఇంక మీఅదుపాజ్ఞలు నామీదకాదు అంధప్రాయు లెవరైనాఉంటే వారిమీద.

పాప—(నోరావలించి) ఎంతటిదానవయ్యావే!

నిర్మ—అవడమేకాదు. ఏది ఆర్జనలేకుండా అన్యాదత్తమైన ఆస్తి కలుస్తుందని భ్రమించి నాకా పాడుపెళ్ళి చేశారో ఆ పదెకరాల ఆస్తి ఆడవాళ్ళ జీవితోద్ధరణకు ఆధారభూతమైన ఈ అనాధశరణాలయానికి రాసియిస్తాను.

ఉప—నిర్మలా నీపరివర్తనా హృదయాన్ని నీధైర్యసాహసాన్ని చాలా శ్లాఘిస్తున్నాను.

పాప—ఇప్పుడేందారి సుబ్బారాయుడుబావా.

ప్రసా—గోదావరి.

సుబ్బా—ఇంకా ఎందుకుబావా, నీకాపిచ్చి. ఇద్దరికీ పెళ్ళిచేసి వాళ్ళ ఆశయాలప్రకారం వాళ్ళని విడవడమే మనధర్మం.

పాప—నువ్వుకూడా వాళ్ళల్లోనే ఐక్యమయినావూ? అయితే నీ యిష్టం వచ్చినట్లె కానియ్యి.

సుబ్బా—నిర్మలా! అమరమైన హైందవవరదేవత కుంకుమ. దీనిని ఫాలభాగాన ధరించిన ప్రతి స్త్రీకూడా హిందూపవిత్రతను

ప్రస్ఫుటపరుస్తుంది. సంఘం తన కఠోరహస్తాలతో మీ వక్షఃప్రాయంలో మీనుండి వేరుచేసిన యీకుంకుమను తిరిగి మీకందజేస్తున్నాను. తీసుకోతల్లీ (నిర్మల శశినుదుట కుంకుమ ఉంచుకొందురు)

సుబ్బా—భానూ ఇటురా నాయనా.

ఉద—(సమీపించును)

సుబ్బా—నిర్మలా అబ్బాయి హస్తాన్ని పట్టు.

నిర్మ—(ఉదయభాను హస్తాన్ని పట్టును)

సుబ్బా—(దీవిస్తూ) మీ వాంఛితాన్ని నెరవేర్చే ఈపెళ్ళి నేను చేస్తున్నాను. ఎన్నికష్టాలు కలిగినా సంఘసేవను మరువ వద్దని సంతోషంతో శాసిస్తున్నాను.

ఉద—నాన్నా ఈ శుభసమయంలో శశీ ప్రసాద్‌లకుకూడా.

సుబ్బా—ఆ ఇలారా నాయనా ప్రసాద్ అమ్మా శశీ ప్రసాద్ చెయ్యి బట్టుకో.

శశి—(ప్రసాద్ చెయ్యి పట్టుకొనును)

సుబ్బా—మావాడి ఆదర్శాననుసరిస్తూన్న మీరుకూడా నాబిడ్డలే సంఘసర్కరణే మీజీవితలక్ష్యంగా భావించి ఆచరించండి. ఇదే నా ఆశీర్వాదం,

ఉద—(నమస్కరిస్తూ) నాన్నగారూ! నాజన్మ మీమాటవల్లతో ధన్యమైంది. ఇదేసమయాన మీరిచ్చిన భారాన్ని నిర్వర్తించ గలనని ప్రమాణం చేస్తున్నాను.

సీ. జీవితసర్వంబు భావిసంఘోదయం
బతుకంత సేవకు అర్పితంబు
రుధిరస్రవంతి [illegible] యుత్[illegible]చును
అంత[illegible] [illegible] అర్ధశీల్ప

తూట్లుపడిన మేను దూదిపింజలయట్లు
రాలిపోయిన యేను నేలకొఱగ
కష్టపరంపరల్ యిష్టులై తోడొచ్చి
బాధపెట్టిన నాకు భయములేమ
దారిజూపితివయ్యా నే ధన్యుడైతి
మరువజాలను మీకృప ధరణినుండ
చెప్పుకొనుచును జీవింతు గొప్పతోడ
మెరుపుగల్గినబంగారు మేల్మిగాదె

నిర్మలా ఏదీ మన ఆదర్శజ్యోతికి మంగళగీతం పాడు.

(హారతి వెలిగించును)

## మంగళగీతం

జ్యోతివై వెలుగవో జగతిలోనెపుడూ ॥జ్యో॥
ఆంధ్రదేశా ఆదర్శజ్యోతీ ॥జ్యో॥
శాంతిప్రదాతవు జ్ఞానవిధాతవు
సంఘసంస్కరణ చేసితివీవే
నీ నీమమే ప్రజకాధారమా ॥జ్యో॥

## మంగళం



# శ్రీ మహాభారతము-వచనము

## మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి ప్రణీతము

18 పర్వములు — 16 సంపుటములు

| | | | | |
|---|---|---|---|---|
| ఆదిపర్వము | | 4 | 0 | 0 |
| సభాపర్వము | | 1 | 0 | 0 |
| అరణ్యపర్వము | 1 వ భాగము | 3 | 0 | 0 |
| డిటో | 2 వ భాగము | 3 | 0 | 0 |
| విరాటపర్వము | | 2 | 8 | 0 |
| ఉద్యోగపర్వము | | 3 | 0 | 0 |
| భీష్మపర్వము | | 3 | 0 | 0 |
| ద్రోణపర్వము | | 3 | 0 | 0 |
| కర్ణపర్వము | | 2 | 0 | 0 |
| శల్యపర్వము | | 1 | 8 | 0 |
| సౌప్తికపర్వము | | 0 | 12 | 0 |
| స్త్రీపర్వము | | 0 | 8 | 0 |
| శాంతిపర్వము | | 4 | 8 | 0 |
| అనుశాసనికపర్వము | | 3 | 0 | 0 |
| అశ్వమేధపర్వము | | 1 | 8 | 0 |
| ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | | 1 | 4 | 0 |

పూర్తిసెట్టు వెల రు 37—8—0

వలయువారు:—

## కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

# ఆంధ్ర నాటకములు

| | | |
|---|---|---|
| చిత్రనళీయము | 1 | 12 |
| విషాద సారంగధర | 1 | 12 |
| పాదుకాపట్టాభిషేకము | 1 | 8 |
| సావిత్రీ చిత్రాశ్వము | 1 | 8 |
| ముక్తావళి | 1 | 8 |
| ప్రహ్లాద | 1 | 8 |
| రామదాసు | 1 | 8 |
| రామకబీరు | 1 | 8 |
| సుభద్రార్జునీయము | 1 | 8 |
| అస్పృశ్య విజయము (ప్రేమచంద్రయోగి) | 1 | 8 |
| భక్తతుకారామ్ | 1 | 8 |
| కృష్ణలీల | 1 | 8 |
| లవకుశ | 1 | 8 |
| భక్తకుచేల | 1 | 8 |
| మేవాడు శౌర్యాగ్ని | 1 | 8 |
| విభీషణ పట్టాభిషేకము (లంకాదహనము) | 1 | 8 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము | 1 | 8 |
| రామరావణ యుద్ధము | 1 | 8 |
| సతీతులసి (జలంధర) | 1 | 8 |
| గయోపాఖ్యానము | 1 | 12 |
| పారిజాతాపహరణము | 1 | 8 |
| చతురచంద్రహాస | 1 | — |
| శ్రీకృష్ణ తులాభారము | | |
| మార్కండేయ (శివలీల) | | |
| చింతామణి | | |

వలయువారు:—


కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి